# శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే రచింపబడిన గ్రంధములు

## —: నాటకములు :—

| | | | |
|---|---|---|---|
| 1 | పాండవజననము | 1 | 4 |
| 2 | పాండవప్రవాసము | 1 | 8 |
| 3 | పాండవోద్యోగము | 1 | 12 |
| 4 | పాండవ విజయము | 1 | 12 |
| 5 | పాండవాశ్వమేధము | 1 | 8 |
| 6 | పాండవరాజసూయము | 0 | 8 |
| 7 | దంభవామనము | 0 | 10 |
| 8 | అనర్ఘనారదము | 0 | 10 |
| 9 | సుకన్య | 0 | 10 |
| 10 | పండితరాజము | 1 | 0 |
| 11 | ప్రభావతీ ప్రద్యుమ్నము | 1 | 4 |
| 12 | చవితి చంద్రుఁడు | 0 | 10 |
| 13 | వ్యసన విజయము | 0 | 10 |
| 14 | ఎడ్వర్డు పట్టాభిషేకము | 1 | 0 |
| 15 | మృచ్ఛకటికము | 2 | 0 |
| 16 | ముద్రారాక్షసము | 1 | 8 |
| 17 | బాలరామాయణము | 3 | 8 |
| 18 | సౌవర్ణపాత్రికము | 0 | 8 |

## —: ప్రహసనములు :—

| | | | |
|---|---|---|---|
| 19 | రసాభాసము | 0 | 4 |
| 20 | త్రిలోకవిజయము | 0 | 12 |
| 21 | పల్లెటూళ్ళ పట్టుదలలు | 0 | 12 |
| 22 | అపూర్వ కవితావివేచనము | 0 | 8 |
| 23 | కవి సింహగర్జితములు | 0 | 8 |

## —: లఘుకావ్యములు :—

| | | | |
|---|---|---|---|
| 24 | వ్రతకధలు | 2 | 0 |
| 25 | పురాణగాధలు | 2 | 0 |
| 26 | శనిగ్రహము | 0 | 2 |
| 27 | రసికానందము | 0 | 2 |
| 28 | గ్రామసింహము | 0 | 4 |
| 29 | సంగదోషము | 0 | 4 |
| 30 | బిడాలోపాఖ్యానము | 0 | 4 |
| 31 | వ్యాసనిష్కాసనము | 0 | 4 |
| 32 | వైరాగ్య శతకము | 0 | 4 |
| 33 | దైవతంత్రము | 0 | 8 |
| 34 | శుకరంభాసంవాదము | 0 | 8 |
| 35 | శివశంకర విజ్ఞప్తి | 0 | 4 |
| 36 | రాసభకుమారుడు | 0 | 4 |
| 37 | దివ్యతిరుపతి | 0 | 4 |

## —: సంస్కృతగ్రంధములు :—

| | | | |
|---|---|---|---|
| 38 | కాశీసహస్రమ్ | 1 | 0 |
| 39 | ధాతురత్నాకరమ్ | 2 | 8 |
| 40 | శృంగార శృంగాటకమ్ | 1 | 0 |
| 41 | క్షమాపణమ్ | 2 | 8 |
| 42 | పిష్టపేషణమ్ | 0 | 8 |
| 43 | శలభాలభనమ్ | 0 | 8 |

## —: పరిశిష్టము :—

| | | | |
|---|---|---|---|
| 44 | కవితా వివేచనము | 1 | 0 |
| 45 | అత్యద్భుతవిమర్శనము | 1 | 0 |

వలయువారు:

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు
వేంకటేశ్వర పబ్లికేషన్సు
కడియం P. O.
తూర్పు గోదావరి జిల్లా. అని వ్రాయుడు.

శ్రీ మత్పరదేవతాయై నమః

# బాలరామాయణము

— రాజశేఖర మహాకవి కృతికి తెనుఁగు —


శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు

శతావధానులు



మూడవ కూర్పు — వెయ్యి ప్రతులు.

ప్రాప్తిస్థానము:

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు,

వేంకటేశ్వర పబ్లికేషన్సు

కడియం P. O.

తూర్పుగోదావరి జిల్లా.

1955


★

# ఇందువచ్చు పాత్రలు

| | | |
|---|---|---|
| సూత్రధారుడు | మాల్యవంతుడు | వైతాళికుడు |
| పారిపార్శ్వకుడు | ప్రభంజనికుడు | కర్పూరచండుడు |
| శునశ్శేపుడు | వామదేవుడు | సుగ్రీవుడు |
| రాక్షసుడు | సుమంత్రుడు | విభీషణుడు |
| రావణుడు | రత్నశిఖండుఁడు | హనుమంతుడు |
| ప్రహస్తుడు | సీత | సముద్రుడు |
| జనకుడు | చెలులు | కపిత్థుడు |
| శతానందుడు | పుష్పకము | దధిత్థుడు |
| భృంగిరిటుడు | సువేగ | సింహనాదుడు |
| నారదుడు | హేమ | సముఖుడు |
| ప్రతీహారి | సౌదామిని | దుర్ముఖుడు |
| మాయామయుడు | చామరగ్రాహిణి | కరంకుడు |
| పరశురాముడు | సిందూరిక | కంకాళకుడు |
| మాఠరుడు | శూర్పణఖ | ఇంద్రజిత్తు |
| ఋచీకుడు | కైకేయి | యమకింకరుడు |
| పులస్త్యుడు | కౌసల్య | చిత్రగుప్తుడు |
| శిష్యులు | సుమిత్ర | పురందరుడు |
| చిత్రశిఖండుడు | గంగ | చారుణుడు |
| కోహలుడు | యమున | రత్నశేఖరుడు |
| రాముడు | త్రిజట | అగస్త్యుడు |
| లక్ష్మణుడు | వేత్రవతి | వసిష్ఠుడు |
| విశ్వామిత్రుడు | చారిణి | భరతుడు |
| ఉపాధ్యాయుడు | లంక | శత్రుఘ్నుడు |
| దశరథుడు | అలక | .... |
| మాతలి | లోపాముద్ర | .... |

శ్రీమత్పరదేవతాయైనమః

# బాలరామాయణము

## ప్రథమాంకము

చం. వెలయు నిలన్ శ్రుతిప్రసృతి పేయమధుచ్యుతిమై రుచించు వ
స్తులకు మొదల్కళాత్మకము సూక్తివిభూష్యము సుప్రసత్తికిన్
నెల వభిధేయకాయరమణీయము నైన వచోనిగుంభ మా
జలనిధిచంద్రతారకము సత్కవిగోపతిసేవ్యమానమై.

సూత్రధారుఁడు—(నాంద్యంతమందు సంరంభముతోఁ బరిక్రమించి సవినయముగఁ బుష్పదోసిలియొగ్గి) సకలకళాప్రవీణులగు నోసభాసదులారా ! ఈగుణనిధి మీ కించుకు నొక విన్నప మాచరించుచున్నాఁడు. నాట్యాచార్యుండగు ధూర్తిలుం డొనరించిన ప్రతిన తమ రంద తెలిసినదియేకదా.

గీ. తెలుము వీరరసంబద్భుతరస మున్న
రూపకములందు మిగులఁ నేర్పున జెలంగు
నతఁడె గేయంబునందు నృత్యంబునందు
వలఁతియగు నాకొమార్తకు వల్లభుఁడని.

అందుదక్షిణాపథమునుండివచ్చిన రంగవిద్యాధరుఁ డను భరతపుత్రుండు మీచేతఁ బరీక్షితుఁడై నిర్వాహమందఁడయ్యెఁగదా! ఇఁక నన్నును బరీక్షింపుఁడు. (ఆకసముదెసకుఁ జెవియొగ్గి) ఏమనుచుంటిరి ? విలక్షుండగునా కర్ణాటునటుండు, కర్ణాటకుల పౌరుషంబు లెందును వెనుదీయునవి కావుగాన, నిర్మర్యాదముగ నిట్లుపలికె ;

గీ. ఎదుటఁ బరిణేత యుండుఁగా కేన దాని
నపహరించెద నిజముగా శపథ మిదియ
వెలఁదిబన్నంబులను సైచుఁవిధముగల్గు
చదువులను దాక్షిణాత్యులు చదువలేదు.

అని యనుచుంటిరా? (దోసిలియొగ్గి) అయిన నాపల్కు పల్కులఁగూడ నవధరింపుడు. నేన పెండ్లియాడినయెడల

గీ. కడలి నడిమిటి తిన్నెకై కడఁగివాఁడు
తీసికొనిపోయినను నేను దిరిగి తేర
నపుడు, వర్ణవలంఘనం బనఁగ నెంత?
యనుఁగుఁ బెండ్లము నింకొక్కఁ డపహరింప.

ఏమంటిరి? అయిననిఁక నుపక్రమింపుమనియా? (ఆలోచించి యెదుటికిఁ జూచి) అదియేమి?

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) ఇదే అది.

సూత్ర—ఇదేమిటి?

పారి—సభాసదు లొసంగిన పత్రము. చదువుము.

సూత్ర—(స్వగతము) ఎండ కావలయువానికి మబ్బు తటస్థించినగతి నుపక్రమించినది యొకటియుఁ దటస్థించినది. మఱియొకటియు నాయెఁగదా! (విచారముతో) సత్కార్యారంభములకు విఘ్నపుతుపర లడ్డుదగులుచుండును. (నిరూపణముతో) అవును. అనిర్వేదము కార్యసిద్ధికి మూలము (నిశ్చయించి) ఇట్లవునుగాక, (ప్రకాశముగ) మారిషా? రసాంతర తిరస్కారముచే నాడెందమునకు స్వస్థత కానరాకున్నయది, కావున నీపత్రము నీవేచదువుము.

పారి—(తానేచదువుచున్నాఁడు.)

గీ. పూర్వకవులు రచించిన పుణ్యచరిత
మెద్దియేనియు రూపకం బెవరుగాని
మించుగతిదోఁప నాంధ్రీకరించిరేని
శ్రేష్ఠమగుఁగాన దాని దర్శింపవలయు.

సూత్ర—(విని, ఆలోచించి, స్మృతికిఁదెచ్చుకొని) దైవమనుకూలించిన నందఱికిని శుభము రాఁగలదు, సభాసదుల యానతియు నాతలంపును నేకీభవించుట తటస్థించినది, మున్ను భుజస్తంభాలానితలక్ష్మీకరేణుండును రఘువంశైకభూషణంబును నగు మహేంద్రపాలమహారాజుచే నియోగింపఁబడిన సభాసదులయెదుటఁ బ్రదర్శింపఁబడినదియు రాజశేఖరకవికృతమును బాలరామాయణనాటకము తెన్గింపఁబడియున్నది, అయ్యదిప్రయోగించి యీసభాస్తారుల యుల్లంబులు రంజిల్లఁజేసెదనుగాక, (పరిక్రమించుచున్నాఁడు.)

పారి—బావా! బాలరామాయణ మాంధ్రీకరించినవా రెవరు?

సూత్ర—ఇంతదనుక నీవెఱుంగవాయేమి?

సీ. తనకు వేంకటశాస్త్రి తగిన సహాధ్యాయిగాఁ బాణినీయాబ్ధి కడచి, రెండు
భాషలలోఁ దత్కృపం గవియయ్యు ననేకముల్కృతలేఖినీకవిత్వ
తంత్రముల్ పెక్కుగ్రంథమ్ము లాతనిసహాయమునఁ గావించి యయ్యనఘుఁగూడి
శ్రీపోలవరపురీభూపాలుఁ డాంగ్లేయభాషాప్రవీణుండు బహుకళాధు

గీ. రంధరుఁ డతిశాంతుండు సరసుఁడునునగు
రామచంద్ర వేంకటకృష్ణరాయచంద్రు
నొద్ద బుధుఁడును గవియు మాన్యుండునై చె
లంగుతిరుపతిశాస్త్రి తెలుంగుఁజేసె.

పారి—బావా: నీనుడివలన నిది గావించినవా రొకరో లేక యిరువురో నాకుఁ దెలియ
కున్నది గాన నేర్పఱచి చెప్పుము.

సూత్ర—ఎవరేదిరచించినను నాసహాధ్యాయు లిర్వురును రచించినట్లె గ్రంథాంత గద్యం
బునం దుదాహరించుకొందురు.

పారి—మున్నుమహర్షియగు వాల్మీకిరచించిన రామాయణముకంటె నీరాజశేఖరకవి
యీనాటకమునఁ బ్రదర్శించిన విశేషమేమి ?

సూత్ర—ఒక్కొకచో నొక్కనికి మిగులఁబౌఢిమ వాటిల్లుఁగాని యందఱకు నన్నిటి
యందును నేర్పుగలుగదు.

పారి—బావా! దివ్యదృష్టికతంబున నఖిలప్రాపంచికశబ్దార్థంబులు కరతలామలకంబులు
గానుండు మహామునులకుఁ బెక్కువగా నీచర్మదృష్టియగు కవికిఁ దెలియునే ?

సూత్ర—మారిషా! అట్లుగాదు,

తే. గీ. కిల్వరేకులచేత సంఘటితమైన
నేత్రమబలలమొగముల న్నెలలయందుఁ
గ్రాలుగతి సుకవీంద్రుల రసనలందుఁ
దనరు సారస్వతంబు నేత్రంబొకండు.

అదియునుంగాక యీకవిమిగులఁ బ్రాజ్ఞుండు తుల్యవస్త్వంతరముల నతిక్ర
మించుటేకదా ప్రజ్ఞాప్రకర్షము ; యీసూక్తిని మహామంత్రి పుత్రుఁడగు
నాకవియే వక్కాణించె.

చ. పుడమికినాల్గుప్రక్కల సముద్రముహద్దు, సముద్రమన్న నా
మడలోకనూఱు, మింటిపరిమాణము గొల్చుచునుండు ద్వాదశా
త్ముఁడు దినమంతటం బఠిసపోలిక, నిట్లు సమస్తవస్తువుల్
పడయును మేర, సత్కవులప్రజ్ఞకుమాత్రము మేరలేదిలన్.

పారి—అట్లైన నమస్కరింపుము.

సూత్రి— ఆమహాకవియే నమస్కరించినాడు.

గీ. పుట్టఁబుట్టినవాఁడు ప్రఖ్యాతసుకవి
యగుచుఁ గావించినాఁడు రామాయణంబు
యోగి ఛందఃప్రణేత ప్రాచ్యుండుమౌని
చెలఁగుఁగావుత మెపుడుఁబ్రాచేతసుండు

మఱియునమ్మహాకవి ప్రబంధారంభమున నిట్లుపలికినాఁడుఁ

చ. పనివిని చెప్పుచుంటిమొక వస్తువుమేలగు మీకు బ్రాహ్మణుల్ !
వినిగ్రహియింపుఁడయ్య ! యిదె వెట్టితి దోసిలి యోగ్యులార ! హా !
వినయములేలనాకుఁ? గృతివిన్ననువైనఁ దదుక్తిమాధురిన్
దనియకపోరు పండితులు దైన్యముఁదేదొకొ యాచ్ఞ యేరికిన్?

అన్నిభాషలును నేర్చిన యక్కవియే మఱియునిట్లుపలికినాఁడు.

ఉ. వేలుపుబాస వీనులకు విందగుచుండు స్వభావమాధురీ
లాలితమల్ల ప్రాకృతము లాల్యము మిక్కిలి సూతభాషయున్
జాలికమున్నుగాఁ గలుగుసూక్తుల త్రోవలు వేఱువేఱు; భా
షాలలితుండివన్నియును సత్కవిసత్కృతులందుఁ జేరుచున్.

వెండియు నేతత్ప్రబంధ గౌరవముంగుఱించి యతండ యిట్లువాక్రుచ్చె.

చ. ఇదియొక పెద్దకబ్బమని యీరసమాదెదరేని. శయ్య యె
ట్టిది. రసమెట్టిదంచు నొకచేపలుకగ్గెద; లెస్సయంటిరేఁ
జదువుఁడు షట్ప్రబంధముల చాడ్పునదీనిని; చెట్టయంటిరే
నదుకులబొంత యిద్ది యడఁగాఱుత నట్టువునాల్కపట్టునన్.

పారి—బావా! నీకును మహేంద్రపాల మహారాజునకును గడువిశ్వాసపాత్రుఁడగు నిమ్మహాకవి యేగోత్రమందు జనించినవాఁడో?

సూత్రి—ఓరీ, తెలివితక్కువవాఁడా! గగనాలంకారమణియగు సూర్యునిగూర్చి కూడ వితఁడెవ్వరని యడుగుదువు కాఁబోలును.

గీ. మూర్తసద్గుణ గణమన మొదలఁ గాల
జలదుడాపై సురానందుఁడలఘుబుద్ధి
తరళ కవిరాజముఖు లనంతరము పుట్టు
వంటెనకులంబు దనరు యాయావరంబు.

తత్కుల సంభవుండును నకాలజలదునకుఁ జతుర్థపురుషుండును మహారాష్ట్ర చూడామణియును శీలవతీమర్దుక తనయుండును నగునుపాధ్యాయ రాజశేఖరకవి యను నది గొప్పప్రతిష్ఠకాదా! (ఏదోవినినట్లభినయించి) ఆహా! కవి తనకుఁదా నాశీర్వదించు కొనిన యాశీర్వాద మెంతబాగుగనున్నది!

గీ॥ వేదవిద్యాలతలకెల్ల నాదికంద
మింకనాల్కపై ననిమేషదృష్టి కవుల
కెవ్వరేదికోరిన నదియిచ్చుదేవి
చెలఁగి వాఙ్మూర్తి ననుఁగటాక్షించుఁగాత.

మెండియు నిట్లుపలికినాఁడు

శా. భ్రాజిష్ణుండగు రాజశేఖరుఁడు నిర్వ్యాపర్థించుచున్నాఁడు దే
వీ! జిహ్వే! ధరియింపు నీపయిగుణప్రీతన్ వచోదేవతన్
రాజన్యుల్ నిజవంశశేఖరుని శ్రీరాముల్ ద్విషద్భీము నెం
తేఁజెప్పం దొరకొన్న మత్ప్రతిభ కుద్దీపించె సంకోచముల్.

పారి—ఇటులు ప్రార్థించినవాఁ డేల పొగడ్త కెక్కఁడు?

సూత్రి—పొగడ్తగాంచినాఁడుగదా యిట్లుదైవజ్ఞునిచే.

గీ. మొదట వాల్మీకి కవియయి పొల్పుగాంచె
భర్తృమేంతుఁడై పిదపఁబేర్వాసికెక్కె
నవలభవభూతియయ్యె నేయతఁ డతండె
రాజశేఖరుఁడై నేఁడు రాణకెక్కె.

మఱియు సభ్యుఁడగు శంకరవర్మ యతని వర్ణించిన వర్ణనము వినలేదా!

చ. శ్రుతులరసాయనంబు చవిచూడ, సదుక్తులకూర్పొనర్ప, న
ప్రతిహతయౌ రసాపగకుఁ బారముగన్గొన, జీవితాహ్వయ
క్షితిజపు సత్ఫలంబుల భుజింపఁ దలంపగునేని, చేయుఁడీ
జతనము రాజశేఖరుని సత్కవితల్ విన నార్యసోదరుల్!

శా. ఆపన్నార్తిహరుండు విక్రమధనుం డౌర్జిత్యవారాశి ధూ
తాపాయుం డతిదాత సత్యజలధిప్రాలేయభానుండు స
ద్వ్యాపారుం డతనిన్ నుతింపఁ దరమౌనా? యేమిచెప్పన్వలెన్
భూపాలుండు మహేంద్రపాలుఁ డతనిం బూజించు శిష్యాకృతిన్,

(నేపథ్యమందు ధ్రువాగానముఁ జేయుచున్నారు.)

క. విధుమండలసాన్నిధ్యము బుధవిబుధోత్కరము విడిచివచ్చి మఱి తమో
విధురుఁడగు గగనమణిసన్నిధికేఁగి సముల్లిఖించె నింగిం గనుమా.

సూత్ర—సభాసదుల యానతి విని కుశలులగు కుశీలవు లుపక్రమించినట్లున్నది. లేనియెడల శునశ్శేపుని ప్రవేశసూచకంబగు ధ్రువయేలవినఁబడు (విమర్శించి) ధ్రువయనఁగా నాటకమునకుఁ దొలిప్రాణము.

గీ. వస్తుభూమిక లెల్లను వ్యక్తపఱచు
సభ్యులమనంబునకుఁ జేయు సంతసంబు
సకలరసములఁ గూర్చు నాటకములందు
ధ్రువకుఁజాలినగీతి లే దవనియందు.

మనమును ననంతర కర్తవ్యంబునకై యత్నింతము రమ్మ.

(ఇదిప్రస్తావన.)

(అంతట శునశ్శేపుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

శున—ప్రాతస్సవనమందు యజమానునిఁ జూడవలయునని తలచితిని. సంధ్యావందనముఁజేయుచుఁ గూరుచున్న నాకుఁ గాలాతిక్రమణంబు కాలేదుకదా? (యాకసమువంకకుఁజూచి)

గీ. ముజ్జగముమేడమొగసాల మొనయు హస్త
దీపికలు, ప్రొద్దుఁబవడపుఁదీవెలేఁత
చిగురుటాకులు, పవలేన్గు చెవుల కరుణ
చామరము లినకాంతులు కోమలములు.

గీ. ముందునడచుచు నాకసమందుఁ జెలఁగు
తేజమిదియే పురాణమూర్తి యగుతరణి
యాజ్ఞ్యవల్క్యుండు శిష్యుఁడీయనఘమూర్తి
కెతనిశిష్యుండు జనకుఁడు నృపుఁడు యోగి.

రాక్షసభీతిందొలఁగించు మందగురామచంద్రుని వెంటంగొనిరా నయోధ్యకుం జనినవిశ్వామిత్రుండు తన్నుం జన్నంబునకుఁ బిలిచిన శ్రోత్రియ క్షత్రియుండును మిత్రుండును నగుజనకభూపాలుని సత్రసంపూర్తికై తనకుం బ్రతినిధినిగానన్ననిపె. అధ్వరకాలంబున కవ్వవధిగాఁ బయనమైతి. నేఁబోవునాఁటి కవబృథంబు మిగులుగా నుండునేమో! అవబృథపుసుస్నానమడిగియైనను గురువులదెస నపరాధంబుఁ జేయవివాఁడనవుదు. (పరిక్రమించుచున్నాఁడు.)

(అంతట విప్రవేషంబున నొకరాక్షసుఁడు ప్రవేశించుచున్నాఁడు)

గీ, రాచపాఱుని వార్తనరయుమటంచు
మాల్యవంతుఁడు పంప నమ్మదముమీఱ
నేను పోనుంటి మిథిలకు నిమిపురంబు
నకు నయోధ్యకు రాఘవనగరమునకు.

కులధురంధరుండ ననికదా యేను నియోగింపఁబడితి. సీతయను నయోనిజాత యగుకన్యను జనకుండు గిరీశధనురారోపణంబు పణంబుఁగాఁ బెండ్లిసేయుదునని యొనర్చిన ప్రతిన దశాననుండు వినియె. అతనికి, మర్త్యలోకసంచారమున కానతి యీఁబడిన, శూర్పణఖ యనుచెలియ లనుదిన మిటువంటిరాచపనులు నెఱవేర్చుటకు వలంతి. అయ్యది యుచితత్వముగూడ నెఱిఁగినదియే. సేవకజనంబునకు ప్రభుచిత్తాను వర్తనంబు సిద్ధవిద్యకదా. దశాననమహారాజును సీతకొఱకు మిథిలాపురికి రానున్న వాఁడు. వేయేల? గండముమీఁదఁ బిండిక జనించినగతి నొకయకార్యము సైతము జరగినది, పయనంబగుచున్న యన్నిశాచరచక్రవర్తి శివశిష్యుండును పార్వతీధర్మపుత్రుండును భగవంతుఁడునగు పరశురామునిగండ్రగొడ్డలి నపహరించుటకై మాయామయుండను రక్కసు నక్కడకుంబనిచెనఁట. ఇదిపనికిమాలినపని యని తలఁతును. ఏలనః—

ఉ. పౌరుషశాంతులన్ బఱపి పాలనతంత్రముసల్పు నేని చె
ల్వారును ఱేఁడు సిక్తతరువట్లు; బహూచ్ఛలముల్ ప్రభుత్వముల్
చారులు లేనివారల కసాధ్యములేల్పడు లెప్డుఁ. జంచలా
చారనృపాలలక్ష్మి మతిచాలనివానిని మోసగించెడిన్.

(ఆలోచించి) అమాత్యులమీఁద కార్యసిద్ధిని నిలుపని ఱేనిదగ్గఱ మంత్రిత్వము కాల్పనా?

గీ, ఏవియోకొన్ని దుష్కృతులెందుకొఱకొ
చేయుచుందురు తమయిచ్చఁ జెనఁటిరాజు
లకట యవి సవరింపఁగా నతకుతలయి
మంత్రి లెంతేని సంకటంపడవలయును,

గీ. కలుగనున్న యాపద దీర్పఁగడఁగుకంటెఁ
గలిగినట్టిదానిన దీర్పఁగడఁగవలయుఁ
గాన నేమొట్టమొదట సీతానిమిత్త
మునకె ప్రతికారమును జేయఁబూనవలయు.

మాల్యవంతుండు నన్నుంబిలిచి "భద్రముఖా! నీవు మేనకాకాముకుండును త్రిశంకుయాజియు క్షత్రియబ్రాహ్మణుండు నగువిశ్వామిత్రుని యుదంతంబు మాకుం దెలుప వలయు. అతండు సిద్ధాశ్రమమునుండి వెడలెనని వింటి. అతనికి జనకుండును దశరథుండును సమానమిత్రులే. దశరథునిఁజూడ నేగిన యెడల నే నొకకపటంబుఁబన్ని దశకంఠుని మిథిలానగరప్రయాణంబు మాన్పింతు. ఆవిశ్వామిత్రుఁడు రాక్షసులకు సహజవిరోధి. వ్రతచర్యకును వీరవ్రతచర్యకుంగూడఁ జాలినవాఁడు. దశరథుండును నట్టివాఁడే. యోగియగుజనకుండును శమదమాదిగుణసంపన్నుండు సుమీ. యని యానతిచ్చె. కావున నేనును ముందు మిథిలాపురంబున కేగి పదపడి రఘురాజధానికింబోయెద. (యాలోచించి) మునులదెసకుంబోవు చారుండును మునియె కావలయునని యేనును గృతతాపసవేషుండనయ్యు ఋషులవలని భయంబునం గలఁగుచుంటిని. (ఎదుటకుం దృష్టిపఱపి) ఓహో! ఎవరో బ్రాహ్మణుఁడు! (గుర్తించి) విశ్వామిత్రధర్మపుత్రుండగు శునశ్శేపుండు కాఁబోలును. అగుఁగాత. ఇతనివలననె యవ్వార్తనరసెద. (వెనుకకుందిరిగి) భగవానుఁడా! నమస్కారము.

శున—నీమనోరథము సిద్ధించుఁగాత.

రాక్ష—సాప్తపదీనంసఖ్య మనువచనము నన్నుంబ్రేరేచుచున్నదిగాన, నేదియో యొక పిచ్చిమాటడుగుట కుద్యుక్తుఁడనయితి.

శున—అడుగుము.

రాక్ష—విద్యార్థివలెనున్నా విట్లు విద్యావిఘ్నంబుఁ జేసికొన నీకేమివచ్చె?

శున—మాగురువుగారియాదేశము.

రాక్ష—మీగురువెవ్వరు?

శున—భగవంతుం డగువిశ్వామిత్రుఁడు.

రాక్ష—(తనలో) అవుఁగాక యితనిం గోపింపఁజేయుదు, నిద్రయును మదమును గోపంబును జెందినవారి యింగితము సులభముగఁ దేటపడును.
(ప్రకాశముగా) విశ్వామిత్రుఁడనెవరు?

శున—ద్వీపాంతరమునుండి వచ్చితివా యేమిరా? భగవంతుండగు విశ్వామిత్రుని సైత మెఱుఁగకున్నావు!

చ. జమునిదెసఁ జూడ మఱొక్క ఋషిస ప్తకముం దివి నవ్యతారకా
సముదయ మాహవిష్యము ద్యుస త్తతి మ్రిచ్చిలినట్టి యధ్వరాం
గములు వసిష్ఠశాప మడఁగార్చి త్రిశంకునికోస మొండు స్వ
ర్గమును రచించె నెవ్వఁడు సురప్రభునైనఁ దృణీకరించుచున్.

చ. తపమునఁ బ్రాభవంబున నుదారమునీంద్రుల రాజచంద్రులన్
గృపణులఁ జేసె నెవ్వఁ, డిరుగేల సృచంబును విల్లుఁబూను భూ
మిపముని యెవ్వఁ, డాభువనమిత్రుని గాధిజుఁగాదె యవ్విరిం
చి పటుమతిన్ రచించె నల చిత్రశిఖండులయందు నొక్కనిన్.

జన్నంబొనర్చువాఁడై యమ్మహానుభావుఁ డనుపదంబు రాక్షసులవలని భయంబున రక్షకుఁడగు రామచంద్రునిఁ గొనిరా నయోధ్యాపురంబునకుంజనియె.

రాక్ష— (భయముతో) మహాత్మా! కోపింపకుము. బ్రహ్మచారిస్వభావసులభంబగు చాపలంబ యిట్టియపరాధం బొనరించెఁగాని యమ్మహానుభావు నెఱుఁగమి కాదు. రంభనుగూడ స్తంభింపఁజేసిన యయ్యనఘు నెఱుంగని వారెవరు? (తనలో) ఆ. చేయఁదగినది చేసితి, నింక చారవ్యాపారమునకుఁ దఱివచ్చినది (పైకి) మహాత్మా! ఒజ్జలపనుపు నిన్నెచటికిఁ బంపుచున్నదో?

శున— మిథిలానగరంబునకు.

రాక్ష— అచటంగల కార్యమేమి?

శున— ఉపాధ్యాయమిత్రంబగు సీరధ్వజుని జన్నంబునం దార్త్విజ్యము. మహాత్మా! పరదేశివలెనుంటి వెటనుండి యేతెంచుచున్నావు?

రాక్ష— (తనలో) ఇట్లగుఁగాక (ప్రకాశముగా) రోహణాచలపతిసరారణ్యభూషణం బగు నగస్త్యాశ్రమమునుండి వచ్చుచుంటిని.

శున— (కొంచెమనుశయముతో) అగస్త్యుఁడన నెవరు?

రాక్ష— (నవ్వి) మహాత్మా! ఏను జేసినదానికిఁ బ్రతిచేసితివి. తనపొడుపుననెల్ల యుదకంబులును స్వచ్ఛంబులుగఁ జేయునగస్త్యు నెఱుఁగనివారెవరు?

మ. గరువం బేదఁగఁజేసె వింధ్యగిరికిం, గండూషమాత్రంబ సా
గర మాచాంతముఁజేసె, నాపదకుఁ బాల్గావించె వాతాపి నె
వ్వ రగస్త్యుం డెలియంగఁబో రతఁడె లోపాముద్రికున్భర్త వే
దరసంబుం జవిఁగొంచు రోహణముచెంతం గ్రాలు మౌనీంద్రుఁడై.

శున— అన్యోన్యగురుతిరస్కారంబునంజేసి యిరువురమును బ్రాయశ్చిత్తార్హులమైతిమి.

రాక్ష— అట్లైన నఘమర్షణఋగ్జపంబుకొఱకు నాకానతియిమ్ము.

శున— గురునానతి యొనర్చినపిదప నేనును బ్రాయశ్చిత్తార్థంబు యత్నింతుఁగాని యిపుడు నిన్నొకమా టడుగనుంటిని.

రాక్ష— ఆజ్ఞాపింపుము.

శున— లంకకు సమీపంబున నుండు మీయాశ్రిమపదంబున దశకంఠునివృత్తాంత మేమియుం దెలియలేదుగదా.

రాక్ష— శివధనురారోపణంబొనర్చి యదియ పందెముగాఁగల సీతను బెండ్లియాడునని మాత్రము తెలిసినది.

శున— (తనలో) చులుకఁదనంబుగల మనంబున నింగితంబు వెలువరించు నితఁడు రక్కసుఁడై యుండునా? ఆఁ, రాక్షసుఁడే.

క. కడుపునఁబుట్టినికన్యం గడు జగములనెల్ల గెల్పుఁగాంచిన దశకం
ఠుఁడు పురహరుచాపం బెక్కిడి పెండ్లాడఁడొకో యెట్టికీడు కటకటా.

(ప్రకాశముగా) ఏనింక మిధిలానగరంబునకుం బోయెద.

రాక్ష— నేను మత్కర్తవ్యంబు నిర్వర్తించి పిదప బ్రాయశ్చిత్తంబుఁ జేసికొనియెద.

(ఇర్వురును నిష్క్రమించుచున్నారు.)

[ఇది శుద్ధవిష్కంభము.]

(పిదపఁ బుష్పకముతో రావణుఁడును బ్రహస్తుఁడును బ్రవేశించుచున్నారు.)

రావ— శా. ఏవిల్లెక్కిడలేక తూలిరి ధరిత్రీశుల్ మదంబేది వీ
రావేశంబు లయోనిజాత యగుకన్యారత్నముంగోరు నా
కా విల్లెక్కిడఁగావలెం దొడిశరం, బాచేఁతమై వేడ్క ని
చ్చోవర్ధిల్లుతఁ గన్నులిర్వదియు విచ్చుందమ్మిపూఁదోఁటయై.

ప్రహ— ఇదిగో దశాననమహారాజదర్శనాకాంక్షంజేసి వేల్పులమూఁక యాకసంబునం గిటకిటలాడుచున్నది. (ఆక్షేపముతో)

శా. నీరుం జిమ్ముచుఁ బోవుమబ్బుదరి కగ్నీ చేరుమా! వేఁడి చ
ల్లాఋన్, గ్రీష్మమ! యూష్మవాయు నటు పొమ్మా! శీతుతోఁగూడ నో
సూరా! నీవును నాడిఁజల్లనగు మిచ్చో నిల్వరాఁబోకు మా
రౌరా! వీరుఁడు రావణుండు పరుశౌర్యంబోర్చునే యెన్నఁడున్,

రావ— నక్షత్రపుష్పమా! పుష్పకమా! ఒకమాట:

శా. నాకైంకర్యము సేయవచ్చిన మరున్నానావిమానంబులున్
జీకాకై యెడమీయ వేగమున మచ్చిత్తంబు నిర్జించి సీ
తాకాంతాపురవైరిచాపములచేతన్ వింతవిందౌ నిమి
క్ష్మాకాంతాగ్రిజే రాజధానికి సముత్సాహంబుతో నేఁగుమా!

ప్రహ— ఆకసంబను సంభ్రమంబునం దిరుగు పుట్టియగు నీ విమానంబెక్కి యితండు

జనకునిపురంబుఁ జేరియు నేలొకో తొందరపడుచున్నాఁడు. అవుఁగాక యీతనిరాక సీరధ్వజున కెఱింగించెద. (బిగ్గరగా)

శా. శ్రీకంఠుం దగఁదన్నఁగాఁ బదితలల్ రెట్టించు పెంజుట్లతో
డాకేల్గుంపు పదింటఁబట్టుకొని వెంటన్ శస్త్రముల్ దాల్చి క
న్నాకై వర్తిలు లాఁతిచేతులు పదింటం గోయుచోఁ జేసె బ
ల్వీఁకన్ బాహుదశద్వయీదశముఖీ వేషంబు లెవ్వానికిన్.

ఉ. అట్టిఁడు రావణుండు తనయంతన బల్మినిఁ బట్టువాఁడు నీ
పట్టిని బందెముంగెలిచి పట్టఁదలంచెడుఁ; గన్యనిచ్చుటం
బట్టి విదేహరాట్కులము పావనమౌ ధరయుండునంతకున్
బట్టపుదేవి నీయనుఁగుపత్నియసుమ్ము విదేహభూపతీ.

(ఆకసమువంకఁజూచి) "పురాణబ్రహ్మవాదియు యాజ్ఞవల్క్యశిష్యుండును రాజర్షియు నగుజనకుండు పురోహితుండగు శతానందునితోఁగూడ వచ్చుచుండెఁ గాన నందనుక నాస్థానమండప సమీపమునం గూరుచుండుఁ" డనుచున్నారాయేమి?

(పిదప శతానందుఁడును జనకుఁడును బ్రవేశించుచున్నారు.)

జన— ఉ. యోజనసేయుచున్ శతపథోపనిషత్తులు దెల్పు బ్రహ్మమున్
రాఁజరియింతు మాకుశికరాట్సుతు నెమ్మది కేనియుం దురా
భోజికషాయపానపరిపూతమయైన సమాధి వీడి యి
ప్డోజ నటించు మామన మహో! తగు గానము తోడులేకయున్.

శతా— సూర్యప్రశిష్యుండవగు రాజర్షీ! మీగుర్వాశిషమ్ము లమోఘమ్ములు; ఏలన? భగవంతుడగు విశ్వామిత్రుఁడును నీయందు వాత్సల్యంబు వాటించుచున్నాఁడు.

ప్రహ— (మరల వెనుకటి పద్యములు రెండును జదువుచున్నాఁడు.)

జన— అన్నా! తపోధనులకుఁగూడ సుఖప్రత్యయము నిరాటంకముకాదుగదా! ఏమన, సీతార్థియై దశకంఠుఁడుగూడ నగరికేతెంచుచున్నాఁడు!

శతా— ఆహాహా! ఆశ్చర్యము! ఒక్కటైనను గొప్పతప్పిదము గుణసముదాయమును పాడుచేయును! అంతేకదా!

సీ. ఎవనియాజ్ఞాపనం బెల్లవేల్పులనేలు దేవేంద్రుతలమీఁది పూవుదండ
ఎవ్వానికాఁపురం బివ్వసుంధర సాటిచూఁపగారాని లంకాపురంబు
ఎవనిభక్తిపరత్వ మీశ్వరేశ్వరునందుఁ బార్వతీపతియందుఁ బాయకుండు
ఎవనికొల్గిన్నలు వివిధశాస్త్రంబు, లుత్పత్తి వేనికి బ్రహ్మవంశమందు

గీ. వాఁడు వరుఁడౌట మెచ్చఁగావలయు నదియ,
కాని రావణుఁడనుమాట కానిమాట,
ఉర్విలో నెందునేఁగాని సర్వగుణము
లొక్కచోఁగూడియుండుట చిక్కదుగద ః

జన— మహాత్మా ! ఉతధ్యనందన ! సీత నిమ్మనుచు నింటికివచ్చిన లంకేశ్వరున కేమి ప్రత్యుత్తరము సెప్పుదును ?

శతా— ప్రత్యుత్తరమిచ్చి చిరకాలమాయెనుగదా !

జన— ఎవరిచ్చిరి ?

శతా— ఈశ్వరుఁడు.

జన— ఏమని ?

శతా— తనవిల్లని.

జన— (నిట్టూర్పు నిగుడించి)

క. హరువిల్లితఁ డెక్కిడు, బల్గిరిరాజం బతని దెత్తలేదే ? యిది దు
ష్కరమే ? నిముల కితని పొత్తురువేయని చిత్త మెఱియుచుండె మహాత్మా !

శతా— రాజర్షీ ! విచారింపకుము. తనకేలంగలచాపము మనకుం బ్రసాదంబుగా నిచ్చినపార్వతీపతి కథిమతుఁడగు సీతావరుం డెవ్వఁడో యెఱుంగము. కాని దశకంఠుండయ్యనఘుమనోరథంబున కన్యధాకరణంబుఁ గావింప నేరఁ డని మాత్రము చెప్పఁగలము. కనుక దుర్వృత్తుండయినను నామునిపుత్రుని సంభావింతము రమ్ము. (తిరుగుచున్నాఁడు.)

జన— (ఎదుటికింజూచి) మాయదృష్టంబునఁగదా పులస్త్యసంతానముం గనుఁగొనుట లభించె. లంకేశ్వరా ! యిటురమ్ము. ఈపీఠం బలంకరింపుము.

శతా— లంకేశ్వరా ! ఋషిపుత్రుండ వదియుంగాక దివ్యుండవు కావున నీకేతెఱఁగున నతిథిపూజ గావింతుము,

గీ. శ్రోత్రియుం డింటికేతెంచుచో వృషభము
నొండె మేఁకనొండెను గోయ నుచితమగును
దివ్యుఁ డేతేర సుక్రుగ్గంధినిధియగు ని
వేదనము సేయఁదగు నిది విధిహితంబు.

రావ— బ్రహ్మర్షీ శతానంద ! మాకీపని యొనర్చితిరే నిదియే యతిథిపూజ.

చ. సురుల గురుస్థిరాంశముల సూతివహించి, వసుంధరాసుతన్
పరిణయ మౌటకుం గ్రియధనం బయి, మున్ను ధరాత్మజాకుచాం

బరహాతకర్షణక్రియల మాన్యత గాంచిన చేతులందు వ
త్సరములు వేయునున్న పురదాహకుచాపముఁ దేరఁబంపుఁడీ.

ప్రహ— అయోనిజాతయగు సీతతోఁగూడఁ దీసికొనిరండు.

రావ— మ. తొగ నిర్మాల్యముఁ టంబకచ్ఛవికిఁ గాంతుల్ మేనికింగోటఁ ట
త్తొగజేఁ దానవకింకరుండఁట జగచ్ఛూరుండు పౌలస్త్యుఁ డిం
పుగ నీకిర్వదిచేతులున్ మొగిడిచెంబో! చిత్తమా! యగ్గజేం
ద్రగతిన్ సీతను జూచువేళ నయనద్వారంబులం దుండుమా.

శతా— దశాననా! ఇదిగో! మహేశ్వరచాపంబుఁ దేరఁబంపుచున్నాము.

రావ— (మనమునుద్దేశించి) ఓమనమా! హరచాపం బావిర్భవించుచున్నదికాని మన్మథచాపంబు వచ్చుట కాన్పింపదు.

శతా— (విలాసముగఁజూచి)

మ. పవిచే నుగ్గగు పైడికొండ పొడితేవన్మించు కాంతిచ్ఛటా
నివహంబుల్ నలుదిక్కులం గవిసి వన్నెందేఁగ ఘోరాత్మకం
బవు నీ ముమ్మొనవాలుదాల్పు ధనువాహా! నేఁడుగావించుఁ గాం
తివడిన్ లోకమువారి కన్నులకు దౌస్థిత్యప్రదానత్వమున్.

(తెరవంకఁజూచి) కంచుకులలో నెవఁడురా అక్కడ? కన్యాంతఃపురంబున కేగి జనక రాజకన్యకం దోడితెండు.

(తెరలో) ఇదిగో? వచ్చుచున్నది. వచ్చుచున్నది.

(పిదప సీతయు నిరువురు చెలులును ప్రవేశించుచున్నారు)

సీత— రక్కసుఁడని తెలిసి భయప్రమోదంబుల సందునఁబడి తందరఁజెందుచుంటిని.

ఒకచెలి— కుమారికా! రక్కసుఁడని వీనిం దిరస్కరింపకుము. రాక్షసచక్రవర్తిసుమీ.

సీత— అట్లయిన నెక్కువగా భయపడఁదగినవాఁడు.

రెండవది— ఏమి యాలోచించుచుంటిరి? ఇతం డిచటికి వచ్చినపనియేమి!

మొదటిది— శివునివిల్లెక్కువెట్టుటకఁట.

రెండ— అట్లుచెప్పుము. సీతను బెండ్లిచేసికొనుటకా?

మొద— ఓసి! చంచలచిత్తురాలా! శంకరుఁడో శంకరప్రసాదపాత్రుఁడోతక్క నితరులం దాచాపం బెక్కుపెట్టువారలెవరే!

సీత— అమ్మయ్యో; బ్రతికితిని. మబ్బులేని వర్షమువంటి దీనిమాటచేత. (ఎదుటికిఁ జూచి) ఒకపీఁటమీఁదనే కూరుచున్నారు, వీరెందఱో!

చెలులు— ఒక్కఁడే రక్కసుఁడమ్మా. వీనికిరువదిచేతులును బదితలలును గలవు.

సీత— శతానందులవారికి, నాయనగారికి నడుమగూర్చుందును.

రావ— (వేడుకతోఁ జూచి తనలో) మన్మథు నుజ్జీవింపఁజేయఁజాలు దీనిచక్కఁ దనము ముజ్జగంబుల నతిశయించుచున్నది. ఓహోహో !

చ. మసి యొడలెల్లఁ బూసికొనుమాడ్కి విధుండును, జింకమాడ్కి యుక్క
ససి విడివడ్డరీతి, నరుణత్వముఁ బాసినభాతి విద్రుమం
బు, సిరిఁదొరంగి నల్లఁబడుపోలిక బంగరు, నెమ్మిపింఛముల్
పసచెడిన, ట్లడంగుపడుభాతి పికధ్వని యయ్యె సీత రాన్.

తనచేసినపను లన్నిటియందును వివేచకుం డగుకర్త కేదియో యొకటి రుచించునుగాని యన్నియును రుచింపవు. ఏలన.

గీ. తనమదికిఁ దోఁచినట్ల విధాత యీ వి
శాలలోచనరూపు సంసారసార
కలితముగఁజేసి మదనుఁ బైగాఁపువెట్టఁ
బోలు; లేకున్న మరుఁడు న న్నేల యేఁచు.

శతా— పులస్త్యనందనా ! చూడు మిదిహరునిచాపం బిది జనకునికూఁతురు.

రావ— ఆఁ, చూచితిని నిదిహరునిచాపంబు. నేరావణుండ, ఏమిది యసంభావనాగర్భముగా దశకంఠునికిం దగని పలుకాడితివి ! చూడుము.

మ. హరుఁడుం దేవియు నేకదంతుఁడుఁ గుమారాదు ల్మహోక్షంబు భృం
గిరిటాదిప్రమథుల్ గలట్టి సభతోఁ గేళీగతిన్ వెండికొం
డ రయంబొప్పఁ గదల్చినట్టి దశకంఠస్వామికిం బ్రాఁతవి
ల్లురువే రావణుదోర్బలంబు గనుఁగో నూహింతువే దీనిచేన్.

ప్రహ— (తనలో) ఈవిల్లలపురాసురభంజనునకుందక్కఁ దక్కినజోదుల కనారోపణీయంబు (ప్రకాశంబుగా) మామహారాజుదోర్బలం బరయుటకు మహాదేవుండును సమర్థుండుకాఁడు.

గీ. సురలసారంబుఁదీసి యీహరుశరాస
నంబుఁ గావించె మున్ను వనజభవుండు
సురలు మాదేవునింటి కింకరులుగారె
యీశరాసన మెక్కుఁడు లేమిలెక్క.

రావ— (రోషముతో విల్లుకేలంబూని)

శా. వీఁకన్ నేబిగ లాగ నల్లెముడితో వేవంగు రెండంచులన్
బైకై నడ్మికి రెండుగా విరుగుచూపన్ మ్రోఁగు నీవిల్లు ఘో

రాకారుం డగుశూలిచే డమరునం బ్రాపించు రావంబునా
నాకౌకుల్ భయమందు టాంకృతుల దిఙ్నాళంబులన్ నిండుతన్.

శతా— (చాటుగాఁదిరిగి) అహో! అపూర్వంబులగు లంకానాథు గర్వాలాపంబులు విని రాజశేఖరచాపంబు దురారోపంబగుటయు రావణభుజంబు లనివార్యంబు లగుటయు నాలోచింపఁగ శతానందుడనగు నాకును భవిష్యత్కార్యంబు తోఁచకున్నది.

జన— (తనలో) భగవానుఁడా! పురారీ! నీచాపంబునం బ్రవేశించి నాకూఁతుం జనకకులాలంకరణంబుగ నొనర్పుము. జగజ్జేతయయినను రావణుండల్లుఁడగు నేమో యని లజ్జించుచున్నాను.

సీత— (వినయముతో) తల్లీ భూదేవీ! అనుగ్రహించి సీతవిన్నపమాలించి ముందుఁగ నీలోనికిం గొంపొమ్ము పిదప రావణుఁడు ధనురారోపణంబుఁ జేయుఁగాత.

చెలు— భగవంతుఁడా! మారుఁడా! నీకు నమస్కారము, వలదు వలదు. సుకుమారునిమీఁదికింబలె నీరాకాసిపైఁగూడ మృదుప్రహరణంబులు ప్రయోగించుచున్నావేమి?

ప్రహ— సర్వదా యొకరీతిగఁ గాలమెవరికిని జరగదుకదా.

చ. కలితరణచ్ఛలద్వలయకం బగుడాపలిచేత గౌరియున్
వలయితసర్పమైన కుడిబాహున శూలియు లాగ సైఁచి, త
ట్టులిపుడు గాదు రావణుఁ డటుల్ రజతాద్రినదల్చినట్టి చే
తుల నినునెక్కువెట్టు నెటు తూలక తాళెదొ! చాపరాజమా.

అవునుగాక (ఆలోచించి) పాతాళచరులును ద్రిదివసంచారులును సావధానులు కావుటకై యత్నింతు.

చ. కదలకుమమ్మ భూమి! కడఁకన్ దలఁదాల్పుమ దీనిఁ గుండలీ!
బెదరక మోయుమిర్వురను వీపునఁగూర్మమ! వీరిమువ్వురన్
బదిలముగాఁగ మోయుఁడు సమంబుగ దిగ్గజవర్యులార! యీ
త్రిదశులసూడు నేఁడు హరదేవునికార్ముకమెక్కు పెట్టెడున్,

(ఆకసమువంకకుంజూచి)

ఉ. లాలనసేయుమీ హయములం దగఁ బిచ్చుకకుంట! నీవు స్వః
పాలక! తెల్లయేన్గు మెడపట్టునఁ గట్టిగఁ బట్టుకొమ్ము మీ
వ్రేళులఁ జొన్పుఁడీ సురలు! వీనుల; రావణపాణిపీడనో
చ్ఛాలనమాత్రభగ్నహరచాపరవంబు దివంబుఁ బర్వెడిన్.

రావ— ఆహో ! దశాననునియాజ్ఞ : యీనాస్వావయవంబులకుసైత మిట్లు జితగగన చాటుకారంబగు వ్యాపారంబు సెల్లునే.

చ. అనుపమ మైనపట్టుదల యబ్బుటఁజేసి పరస్పరంబుఁ ద
ర్జన మొనరించుకొంచు నొకసారిగ వామభుజావశాగ్రిముల్
ధనువుఁ బరిగ్రిహింపఁ బదితక్కినచేతులు నేననేన యం
చును దివిఁబెగ్గులాడు పనిసుంత గుఱెంచియు నారి లాగఁగన్.

(జుగుప్సాపశ్చాత్తాపాతిశయముతోఁ దనలో) ఏపనియేనియు నాలోచింపక చేయువానికిఁ బరాభవంబువచ్చును. ప్రాకృతునివలె నప్రాకృతుఁడగు రావణుండును ధనురారోపణంబు పణంబుగా సీతం బెండ్లియాడుటకై యత్నింపఁ గూడదు.

(ప్రకాశముగా)

మ. రజతాద్రిం గదలించు టాత్మదశమూర్ధచ్ఛేదనం బవ్యతా
గ్రిజుఁ గారాగృహబద్ధుఁజేయుట మొదల్గాఁ బెక్కుకార్యంబులన్
భుజశక్తిన్ బొనరించినట్టి దశకంఠుం దేవయానాపహా
రు జనంబెన్నునె ప్రాఁతవిల్లొకటి యారోపించినన్ ద్రుంచినన్.

(తిరస్కారంబభినయించుచుఁ జాపంబుఁ గ్రిందఁబడవేయుచున్నాఁడు)

చెలు— భర్తృదారికా ! నీయదృష్టము మంచిది. భవత్పరిణయాశతోఁగూడ రావణుఁడు శివచాపంబు వదలినాఁడు.

సీత— హృదయమా ! నీకు దైవంబును మన్మథుండును ననుకూలించినగతినున్నారు.

శతా—ఓలంకేశ్వరా! పరమశైవుఁడవైతి, విదియేమి కొనియాడుటకుందగని పనిజేసితివి?

జన— (కోపముతో లేచి)

మ. ఆపంజాలరు నామనంబు గురుఁడౌ నాయాజ్ఞవల్క్యుండు దు
ష్కోపావేశ విగర్హణంబు బహుళశ్రిత్యర్థవేత్తృత్వమున్
బాపంబౌ శివచాపధిక్కరణమోర్వన్ లేక యుద్రేకియై
చాపంబెత్తుదు శాపమిత్తునను హస్తం బీజరా జీర్ణతన్.

(ఆలోచించి తెరవంకకుంజూచి) ఎవఁడురా! అక్కడ. విల్లు విల్లు విల్లు. (పిదప నొకపురుషుఁడు ధనువిచ్చి మగుడిపోవుచున్నాఁడు. జనకుండును. నడికట్టు గట్టి గ్రిహించుచున్నాఁడు.)

రావ— (కోపహాసములతో)

శా. వ్రాలుంగన్బొమ లెత్తి. జందెము భుజావస్థాయిఁ గావించుచున్,
గేలందాల్చిన యక్షమాల చెవిపైనింజుట్టి, చేలంబు డా

కేలం బట్టి పిఱుందుఁగప్పుచు నొగిన్ గేల్సాచి విల్వాను శాం
త్యాలంబున్ జనకుఁ డ విరక్తుఁగని యాహా చెందితిన్ నేఁటికిన్.

శతా— ఆహా! మహాప్రభావుఁడగు మాయాజ్ఞ్యని ప్రభావము.

మ. ముదిమిన్ జెప్పినయట్లు రాఁదగని యాభూపాలుపాణిద్వయం
బుదితాహంకృతిఁ జాపమెత్తుటకు నుద్యోగింపఁగా మౌర్వి య
య్యదియే యంచులపైఁ దగుల్కొనె, శరంబా మధ్యముంజేరె; వి
య్యది తద్దివ్యతపఃప్రభావమవు నాహా! యెన్నఁగాశక్యమే.

సీత— హా! ఎంతకష్టము! ఎంతకష్టము! ఉపశమైకధనులగుతండ్రిగారు విల్వానియుద్ధ సన్నద్ధులగుట చంద్రికాంత మగ్ని నార్పఁబూనుటకదా!

ప్రహ— ఓవృథావృద్ధగుదుష్టక్షత్రియుఁడా! దశానను నుద్దేశించి చాపమెత్తుచున్నావు నిన్ను రావణశస్త్రంబగు చంద్రహాసము సైరింపదు సుమీ.

రావ— (బిగ్గరగానవ్వి పరిహాసముగా)

గీ. శిథిలమై తుప్పువట్టిన శివునిప్రాఁత
ధనువు పఙ్క్తిముఖుఁడు దోర్మదమున విడిచె
జనకుఁ డిదిసైఁప కనికిఁజొచ్చునఁట! పోరు
తగదనుచు నవ్వుఁ దొకపెట్టె మొగములార.

జన— పులస్త్యపుత్రి! శస్త్రంబు కరంబునంబూని రమ్ము. పరమశైవుండగు జనకుఁడు నీయపరాధంబు సహింపఁడు.

రావ— ఆహా! సీతాస్నేహం బెంతగాఁ బీడించుచున్నదో! కాదేని దశవదనుం డెన్నఁ దేని యిట్టిపల్కులు సహించెనే!

ఆ॥ వె॥ సోమయాజి వృద్ధు మామయౌ వేదాంతి
యోగ్యుఁడన్న గుణము లొక్కటొకటె
నన్ను శాంతుఁజేయుచున్నవి చంద్రహా
సంబు దాల్పకుఁడు కరంబులార!

జన— రావణా! ఇటు మగుడుము. శరంబుఁ బ్రయోగించుచున్నాను. (అనిబాణంబు సంధించుచుండఁగాఁ దెరలో)

శా. శాంతింజెందుము కోపమాగు జనకా! సన్యస్తశస్త్రుండ వీ
వంతంబే లలయాజ్ఞ్యవల్క్యుఁడు శమోపాధ్యాయుఁ డా నీవు దుః
ఖాంతంబుం బరిణామహీనమగుయుద్ధాటోపముం బూనెదే?
చింతంబాయుము చాపమున్ విడువుమా సిగ్గయ్యె నీచేఁతకున్.

జన— బాలర్షీ శునశ్శేఫ! నీ చెప్పినయట్ల శస్త్రంబు విడుచుచున్నాను. (అనిచాపంబును శరంబులును విడిచి) జగం బరాక్షసం బగుట కీశాపోదకంబులు విడుచుచున్నాను. (అని కమండలువు పుచ్చుకొనుచున్నాఁడు.)

శతా— ఇదియేమి? సూర్యశిష్యుఁడును భగవంతుఁడునగు యాజ్ఞ్యవల్క్యునివలన సంప్రాప్తమయిన తత్త్వవిద్యను, నాజన్మసంభృతంబగుతపంబును వ్యయమొనరించుచున్నావు. (అని శాపోదక ముపసంహరించుచున్నాఁడు)

జన— భగవంతుఁడా! విశ్వామిత్రధర్మపుత్ర! కులగురూ! శతానందా!

గీ. హరశరాసనపరిభవ మాచరించె
నట్టె దుర్గర్వుఁడైన యీయసురరాజు
గురువు లిం దానతీ నెఱుంగుదురు తగవు
నాకు నీమాటజవదాఁట న్యాయ్యమగునె!

రావ— మిథిలేశ్వరా! ఎందుకీయాటోపము? రభసనిర్జితైరావణుండగు రావణుండు సుమీ వీఁడు !

గీ. తలలు తెగఁగోసికొని పురాంతఁకుని దృప్తి
పఱచినట్టిదశాస్యుని భక్తిబాహు
బలము లరసి మునుల్ భూమిపులుఁ దపములు
శస్త్రములు వంతురనుట కసంశయంబు.

నీవు సంబంధజ్యేష్ఠుండవనియు వేదాంతవిద్యావరిష్ఠుండవనియు సైరించితిని.

చెలు— చచ్చినవాఁడా! నీమాటలు మాజనకకులదేవతలు పరిహరింతురుగాక.

శతా— నిశాచరచక్రవర్తీ! మిన్నక పొగడుకొనకుము. హరధనురారోపణంబొనరించినవాని కీపొగడ్త శోభించును గాని నీకుశోభింపదు.

రావ— (కోపముతో) ఏమంటి వేమంటివి! హరధనురారోపణం బొనర్చినవానికే గాని నాకుశోభింపదా? (ఆలోచించి) ఏమిచేయుదు!

గీ. ఋషులసభ, రాజు ముదుసలి, యేను సీత
యందుబద్ధానురాగుఁడ; నంద ఱిచటి
వారు దోర్మదమత్తులై మీఱువార;
లైనను దశాస్యుఁ డేరీతి ననియొనర్చు?

(ఆటోపముతో) వినుండయ్యా నిశాచరపతి ప్రతిజ్ఞను.

చ. ధరణియు నింగియుం బగిలి దారుణమౌగతి ఢాంకరింపఁగా
హరునిశరాస మెక్కిడి ధరాత్మజ నెవ్వఁడుగొన్నఁగాని నేఁ

గరకరఁ దగ్గళాస్థికలు గ్రంథియుఁ గోయఁగ మోఁత మ్రోయు ఛీ
గురువగు చంద్రహాసమునకుం బలియిచ్చెద వానిర క్తమున్.

(నేపథ్యమందుఁ గలకలంబు పుట్టుచున్నది.)

రావ— ప్రహస్తా: వి స్తీర్ణజలధరధ్వానతానవకారి యగునీరొద యేదెసనుండి వచ్చినదో కనుఁగొనుము.

ప్రహ— దేవరవారి ననుసరించుటకువచ్చిన మనరాణువల కోలాహలంబు.

(తెరలో వైతాళికుఁడుప్రవేశించి.)

జయజయ దశాననమహారాజా! మాధ్యందినసంధ్య దేవరకు సుఖమొనరించునుగాత.

సీ. చమరీమృగంబులు నెమరువేయుచు నమేరుల యాకుఁగొమ్మనీడలకుఁ జేరెఁ
జల్లఁదనంబుకోసము మంచిగంధపుఁ జెట్టున ఫణి చుట్టచుట్టుకొనియె
ఖండితయగుకాంత ఘర్మితుండగుకాంతుఁగాంచి యీసునఁగౌఁగిలించుకొనియెఁ
గస్తూరిలేఁడి చక్కఁగఁ బిల్లకాల్వలోఁ జీరంబుద్రవ్వి భక్షింపఁదొడఁగెఁ

గీ. గానరంబులు నదుల మున్కలుపొనర్చెఁ,
గోటరంబులఁ దూఱెఁ బక్షులును, బాంధ
చయము చలివేంద్రవంకకుఁ జనియె నతుల
చండమార్తాండమండలచండిమమున.

రావ— అట్లైన మేమును నిసర్గరమణీయంబు లగు మిథిలాపురీ పరిసరారామంబుల కేగి క్రీడించుచు రెండుమూఁడుదినంబు లాత్మకు వినోద మాపాదించుకొనియెదము గాననో సైనికులారా?

మ. లవలీ నాగలతావృతక్రముకమూలప్ర స్తరచ్ఛాయలన్
స్వవధూసంఘముతోడఁగూడి కదళీపత్రంపుఁ బాత్రంబులన్
దవులందార్చుఁడు నారికేళజలముం దాత్యూహకేళీసము
ద్భవకోలాహలభాసురంబు లగు కాంతారప్రదేశంబులన్.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

గద్య.

ఇది శ్రీ....తిరుపతి వేంకటేశ్వరప్రణీతంబగు నాంధ్రీకృత
బాలరామాయణ నాటకమునం
బ్రథమాంకము.



శ్రీమత్పరదేవతాయైనమః

# బాలరామాయణము

## ద్వితీయాంకము

(అంతట భృంగిరిటుఁడు ప్రవేశించుచున్నాఁడు)

భృంగి— (పరిక్రమించుచుఁ దనవంకఁ జూచికొని) అహో! వికృతరూపమునకు సైత మొక్కొకచోట నెక్కువసన్మానము సంప్రాప్తమగును. ఏలన:—

మ. నరముల్ పట్టుగ నున్న యెమ్ములగు నీనామేను చాముండికా
కరతాళంబుల నర్తనంబు లయగాఁ గావించుట ల్చూచి యీ
శ్వరుఁడుం దేవియుఁ బెండ్లివేళనె త్రపాసంకోచముల్ వీడి న
వ్విరి; దానం దయమానఁ డవ్విభుఁడు నాపేరెత్తినన్ నేఁటికిన్.

(మరలఁజూచికొని యెకసక్కెముగా) అహో: త్రిభువనాధిపతి యనుచరుండ నగు నాకీగొప్పవేషము.

గీ. గోచి యుత్తరీయంబు నొకొటియె వల్క
లంబు రుద్రాక్షమాల జడలు సటలును
భస్మపుండ్రంబు నుదుటిపైఁ బాణి శూల
మిట్టివేషముగలవాఁడు భృంగిరిటుఁడు.

(ఆలోచించి) నాస్వామియగు నీశ్వరునకును నాకును వేసమం దిసుమంతయు విశేషంబు లేదు.

గీ. కట్టఁబుట్టంబు లేదు నాగములు నగలు
పాణిఁ బునుక గళంబునఁ బాదదండ
బూది మైపూఁత వార్వ మాఁబోతు హరుని
చరితమిది యిందుఁకతము విచార్యమెందు.

మఱియును లింగంబునం జనించె. భైరవాకారంబు వహించెఁ, దుంబురుం డయ్యెఁ, బార్వతిం బెండ్లియాడి యామె కర్ధశరీరంబొసంగెఁ, జందమామనుదలపై ధరించె, యమునికాగ్రవ్వడంచెఁ, గాలకూటంబుఁద్రావె, జంభారిభుజస్తంభనం బాచరించె, దక్షయాగధ్వంసంబుసేసె, మన్మథునిం దహించెఁ,ద్రిపురంబులుగాల్చె,

మఱియుం బెక్కు దుర్ఘటకార్యంబులొనర్చె నిట్టి పరమేశ్వరుని చరిత మిదమిద్ధమని వచింపఁగ హరివిరించులు నైతము సమర్థులు గారిఁక భృంగిరిటుండన నెంతవాఁడు. అయినను నమ్మహాత్ముని యనంతకల్యాణగుణంబులలోఁ గొన్ని వక్కాణించెద.

ఉ. పుట్టముఁ గట్టఁ దట్టయిన మొగ్గిక్కుదురెల్లరు వేలుపుల్ జరీ
పట్టులుగట్టువారు; వృషభంబును నెక్కను నేస్గు నెక్కనా
జెట్టియె మొగ్గిక్కెడుఁ; నగలు చిల్వలెయైనను మెచ్చుశీగ్గిదుఁడే
యిట్టులు గల్మిలేములకు నీశ్వరుఁడొక్కఁడె యీశ్వరుండహో !

అసమయమందేల యీస్తోత్రప్రపంచ మమ్మహాత్మునియానతి యొనర్చెదను గాక. (పరిక్రమించుచు నెదుటికిఁజూచి) ఓహోహో ! నారదుఁడా ! ఈముని కలహ కుతూహలిగదా !

గీ. ఎదురుగా వచ్చె నీతఁడు కదనమొకటి
యెవరితోనైనజరగు నిక్కవము నాకు
లింగముదయించునాఁడు పోరంగనయ్యె
ధాతకు హరికి నితనికతమునఁగాదె.

అవుఁగాక ! ఇతనివలనన రామరావణులయుదంతంబు సాంతంబుగాఁ దెలిసి కొనియెద. (పరిక్రమించుచున్నాఁడు)

(పిదప నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు)

నార— నిజము నిజము ! ఎవ్వరికైనను సహజంబగు గుణంబు విడువదు.

గీ. పోరెనెవ్వం డెవండింకఁ బోరుచుండుఁ
బోరనున్నాఁడెవండను తీరుగల్గు
పోరుచింతతో నువ్విళులూరు నాకు
నేఁగె నేఁగుచుండెను గాల మేఁగనుండె.

మ. నరమల్ దెగ్గిళ్లినవారువంబులుఁ గృపాణధ్మాతధారానికృ
త్తరణత్కర్వదనేకపంబులు సదాధావత్కబంధోద్ధత
త్వరదాట్యంబులు గల్గు భీషణపుయుద్ధంబుల్ దివారాత్రమున్
సరిగాఁ జూచుటకై జగత్త్రితయసంచారంబుఁ గావించెదన్.

(ఆలోచించి) అందఱును దనకుఁ దనకుఁ బ్రియం బగుపని నగ్గించుచు లాఁతి పనుల నిరసింతురు.

క. యుద్ధంబ పరబ్రహ్మము యుద్ధంబ తపంబునాఁకు యుద్ధమ జపమా
యుద్ధమ యాగాదికమగు నుద్ధతయుద్ధంబ చూచుచుండెద నెపుడున్.

ఏదియో యొకదానియందు వ్యసనముగల మనజున కది తటస్థింపనియెడలఁ దత్ప్రతినిధియును వినోదకరంబగుఁ గావున నేనును;—

గీ. వీరయుద్ధంబు దొరకనివేళలందుఁ
జేతులాఁడగ గోరులఁ జెనకుకొనుచుఁ
గవిసి కామినులొనరించు సవతిపోరు
వినియుఁ గాంచియు నానందవిధముఁగాంతు.

మఱియును,

గీ. లావుకంబులు తీతువుల్ మహిషములును
గుక్కుటంబులు మేషముల్ గూర్చుపోరు
సంతతామోదకరముగా సంచరింతు
హరికి బ్రహ్మకుఁ బోర్వెట్టినట్టియేను.

గీ. వీరులకుఁ గత్తిపోట్లు చేకూరెనేని
కరులకును దంతములురాల విఱిగెనేని
బులులగోరులు వగిలి చేటొలసెనేని
సంతసముఁజెందుఁ గలహభోజనుఁడు మఱియు.

చ. హరిగనెఁ నాడురూపము, బురారి యడంచెఁ బ్రసూనబాణు, ని
ర్జరపతి పోరిలో నురుఁగు శస్త్రముగాఁ గొని వృత్రుఁజంపె, భూ
ధరనుత కాళినాఁ బరమదారుణరూపముఁ దాల్చెఁ బోర మే
ల్చిరమర గల్గు నారదునిచెయ్వు లివన్నియు నెంచిచూడగన్.

ఇప్పుడే నామనోరథసిద్ధి కాఁబోవుచున్న దని తలంచుచున్నాను. తనగండ్రిగొడ్డలి యాచించుటయుఁ బరమేశ్వరు నధిక్షేపించుటయు మున్నగు నకార్యంబులొనర్చిన దశకంఠు నెదిరి జయించుటకై పరశురాముండు మిధిలాపురంబున కరిగెనని యతని శిష్యుండగు మాతరుండు నాకుందెలిపె. (ఆలోచించి) కావున నేనును జనకపురంబునకేగి రామరావణుల కిర్వురకును నలుకలు రెట్టించి నామనోరథంబు సఫలీకరించుకొనియెద. ( అని పరిక్రమించుచున్నాడు. )

భృంగి— (వేగముగాఁ గొన్నియడుగులు నడచి) సురమునియగు నారదునకు స్వాగతము.

నార— ఓహోహో ! మహాదేవానుచరుండగు భృంగిరిటుఁడా ? (ఒద్దకుఁబోయి) భృంగిరిటా ! నీకు శుభమగుఁగాక. ఎచటికిఁ బ్రయాణము ?

భృంగి— విక్రమాగ్రగణ్యులగు పరశురామరావణు లున్నయెడకు.

నార— ఓపణ్డితప్రవరా! బాగుబాగు. మంచిమాట స్మరింపఁజేసితివి. పరాక్రమ మందు రామరావణులలో నెవ్వ రెక్కుడో చెప్పుము.

భృంగి— మునీంద్రా! హెచ్చులొచ్చులు చాలఁగలవు.

చ. ఇరువదియొక్కమాఱు ధరణీంద్రులగెల్చిన జెట్టి తాపసే
శ్వరుఁ డఖిలాగమంబులకుఁ జక్కనిభావముఁదెల్ప వీధికా
గురువు స్వమాతృఘాతకుఁడు కోరినమౌనికి భూమియెల్ల న
ధ్వరియయి యిచ్చినట్టి యతిదాత నుతింపఁగ రాముఁడల్పుఁడే.

నార— ఈశ్వరానుచరా! విక్రమంబున రావణుండును లాఁతియోధులచే వంచింపఁదగిన వాఁడు కాఁడు సుమీ.

ఉ. పుట్టిరి పుట్టఁబోవుదురు పుట్టియుయుండిరి కాని యట్టిమే
లట్టులు మూఁడులోకముల దబ్బఱ, రావణు మీ ఱెఱుంగరే
గట్టితపంబునందుఁ దనకంఠము లన్నియు నిచ్చినట్టి యా
జెట్టికి శూలి సుంతయని సిగ్గరె లోకము లన్ని యిచ్చియున్.

భృంగి— మునీంద్రా! నీవనినమాట సత్యమేకాని —

శా. కైలాసంబుఁ గదిల్చెనొక్కఁ డొకఁడా క్రౌంచాద్రి భేదించి స్వః
పాలుం గెల్చె నొకండు హైహయునిఁ జల్పాసించె నన్యుం డొకం
డాలంకంగొనె శ్రీదుగెల్చి యితరుం డాకొంకణంబందె మే
ల్మేలా యిర్వురకుం జయేందిరయు సామీప్యంబునం గ్రాలెడున్.

నార— (సంతసముతో హస్తంబెత్తి)

ఉ. కంటికివిందు నిర్జరతఁగైకొన పెద్దశుభంబు ముత్తిపే
రింటికి దల్పులేనితెరు వేను ముదంబు వహించుభేషజం
బొంటరి రామరావణులయుద్ధము క్రొంబతులన్ వరించు వా
ల్గంటులతోడ వచ్చి సురలార! కనుంగొనుఁ డేను జెప్పెదన్.

భృంగి— యుద్ధైకరుచీ! నారద! ఊరక లేనిపోని సంతసముఁ జెందకుము. మహా దేవుండు తనవిల్లు నిరసించె ననియుం దలంపక రామరావణుల సంగరంబు మాన్పింపుఁడని ఋచీకపుల స్త్యసహితంబుగా నన్నుం బనిచెఁ గావున నీమనో రథమునకు విఘ్నంబుకలిగె.

నార— (విషాదముతో తనలో) అయ్యో! అతికష్టముగ మొలచిన సంతోషవృక్షంబు వెనువెంటనే నశియించె. అవుఁగాక రావణున కీరామునితో పోరుట లేక పోయినను మఱియొకరామునితో నైనను గయ్యంబుఁ బుఱికొల్పెద కాదేని

యీరామునికి మఱియొకరామునితోనైనను జగడంబు వెట్టవఁగావున నిప్పుడే యయోధ్య కేగవలయును (ప్రకాశముగా) భృంగిరిటా! ముల్లోకంబులవారి కైనను శివుని యాజ్ఞ దాఁటరాదు. నేను మాతండ్రియింటికిఁ బోయెద.

భృంగి— నేనును బ్రస్తుతకార్యంబు నెఱవేర్చుటకై యత్నింతు.

(అని నిష్క్రమించుచున్నారు.)

(పిదప రావణుఁడును బ్రతీహారియుఁ బ్రవేశించుచున్నారు.)

రావ— చ. చిఱునగవున్నచో సుధ రుచింపదు, నెమ్మొగ మున్నచోట పెం
పఱు శశి, కన్నులున్నఁ దొగ లందముఁ దక్కును, బల్కులున్న నే
డ్తెఱచెడుఁ దేనె, మేనిపస డించును బంగరుతేజు నిక్క మ
త్తెఱవ సృజించి ధాత సరితీరు సృజింపఁగ నేరఁడయ్యెడున్.

ప్రతీ— ఈదశాననుం డిప్పటికి నాగోడయందే యాచిత్తరువేవ్రాయుచు గాఢాభినివిష్టుండై యున్నాఁడు. మదనుండుమాత్ర మితనియెడ శతమన్యుపక్షపాతంబును జూపించుచున్నాఁడు. ఓమన్మథా! సకలజననిందనీయుండవగు నీవు దశాననుకనుగ్రహంబురాఁదగిన సమయమందును నింద్రపక్షపాతంబువిడువక రావణునిం దాడించుచున్నావు. సీతపై దయఁజూపుచున్నావు. చాలుఁజాలు. ఇదినీకుం దగినపనియే (ప్రకాశముగా) దేవా! మాయామయుఁడు ద్వారమందున్నాఁడు.

రావ— (వినక) ఓమదనా! యెంతదుర్మార్గుండ వైతివి.

గీ. నన్నుఁ బీడించుచుంటివైనను సమస్త
సురలలో నాకు నీవ యిష్టుండ వో మృ
గాంకబాంధవ! రావణునం దమర్చు
బాణములు సీతపైఁగూడఁ బఱపుచుంటె?

ప్రతీ— దేవా! మాయామయుఁడు ద్వారమందున్నాఁడు

రావ— (వినక) అయ్యో! మదనునిచెయ్వు లనేక విధంబులుగా నున్నవిగదా! ఏలనన, నే నావైదేహిని జూచినది మొదలు—

మ. వికసించు న్ముకుళించు నున్ముఖునుగున్ వీక్షించు మూయున్ నగుఁ
జికిలించు న్మరలుఁ భ్రమించుఁ గదలుఁ క్షేపించుఁ గుందుఁ సము
త్సుకమౌ మించు హరించుఁ బ్రేమలుదయించు న్నీరునించుం జలిం
పకయుండుఁ బొమలెత్తు లోచనము లవ్వైదేహిపైఁ బేరిమిఁ.

ప్రతీ— (తనలో) మండోదరీస్నేహంబును గూడ వదలిన యీతని యుల్లాపంబు లన్నియు సీతామయంబులుగా నున్నవి. అవుఁగాక, నిసర్గదుస్పహం బగు

పరశురాముని పేరు తలంచి యాసీతావేశంబు మరల్చెద. (ప్రకాశము) దేవా! పరశురాముని యొద్దనుండి వచ్చినాఁడు.

రావ— మాయామయుఁడా? అట్లైన శీఘ్రముగఁ దీసికొని రమ్ము.

(అంతట మాయామయుండు ప్రవేశించుచున్నాఁడు.)

రావ— మాయామయా! గండ్రగొడ్డలి యడిగినఁ బరశురాముండేమి ప్రత్యుత్తరమిచ్చె

మాయా— ఓత్రైలోక్యమాణిక్యమా! రావణ! పరశురాముండు నిన్నుద్దేశించి నాతోడం బల్కిన పల్కు లాకర్ణింపుము.

చ. పరశువు గోరనంపితివి పల్మఱుఁ బేర్మి నటంచు మోదముణ్,
హరునిప్రసాద మీఁదగనిదంచు విచారముఁబుట్టె నాకు; భూ
సురులకు మున్నె యిచ్చితి వసుంధర; స్వర్గము నాగలోకముం
దిరముగ గెల్చి యిచ్చెదను నీ కవి కావలెనేని రావణా.

రావ— ఏమీ! పరశురాముఁడు రసాతలత్రిదివంబులు జయించి యిచ్చువాఁడును రావణుండు పరిగ్రహించువాఁడునా! తరువాత నీవేమంటివి?

మాయా— నక్తంచరచక్రవర్తీ! యిదె యిదె చెప్పుచున్నాను.

చ. హరునకు శిష్యుఁడైతి వటులైనను నిర్వదియొక్కమారు భూ
వరులజయించి తట్లయినఁ బల్కెదనొక్కటి విన్ము నీవు కం
ధరమున నీకుఠారమునె తాలిచి మాదశకంఠుమోళ్లికున్
గరములు మోడ్చి వచ్చుటది గాంచఁగలన్ భృగువర్థిసత్తమా.

రావ— (అనుగ్రహముతో) మాయామయా! యిట్టిపల్కులు పల్కుటకు నిన్ను వదలిన మఱియెవ్వరు సమర్థులు. తరువాత తరువాత?

మాయా— (ఊరకొనుచున్నాడు)

రావ— ఒక రన్నపల్కులకు నీకింత సందేహమేల చెప్పుము.

మాయా— నోటికివచ్చినట్లు పేలుట బ్రాహ్మణులకు నైజము. అట్టిమాట లుచ్చరింప రాని పైనను దేవరయానతింజేసి మనవిచేయుచున్నాను.

క. "ఈరానిదనక గొడ్డలి గోరితి వనికిం, బురారి గురుచాపతిర
స్కారముఁ జేసితివి పరశుధార నిను సహింప దోరి దశవదన యిఁకణ్."

రావ— (కోపహాసములతో) గట్టివాఁడవు చక్కనిమాట చెప్పితివి. "ఇచ్చవచ్చినట్లు పేలుదురు బ్రాహ్మణు" లని. క్షుద్రక్షత్రియవిజయు యగు నయ్యధమ మునీంద్రుఁడిఁకఁ దనచాపల్యంబునకు ఫలం బనుభవించునుత్రే.

మాయా— ముజ్జగంబులం దనకుం దగిన వీరుండు లేఁడని యాబ్రాహ్మణవీరుఁడు పొగరుకొని యున్నాఁడు.

రావ— ఎక్కడ నున్నాఁడవురా ! బ్రహ్మవీర !

మాయా— (తనలో) మన ప్రభువుగారు కోపించుచున్నట్లు తోఁచుచున్నది. అవుఁ గాక. ప్రాణముపోయినను భృత్యు లనుచితాలాంపబు లాడఁగూడదు.

చ. క్రతువిధి ఋత్విజుండయిన కాశ్యపమౌనికి భూమియెల్ల యి
చ్చి తివిరి చండమార్గణవిశీర్ణజలంబగు సాగరాంతర
క్షితి నలభార్గవుం డనఁటిచెట్టులు గొబ్బెరచెట్టులున్ ఫణి
వ్రతతులు పోఁకలేలకులుఁ బండెడుదేశమునందు నుండెడున్.

రావ— అటులేని మన మీ మిథిలనుండి లంకకుం బోవునపు డుత్తరమువైపునఁ దట స్థించును.

మాయా— సహజక్రోధుండగు నారేణుకాపుత్రుం డిచ్చటికే వచ్చినట్లు తోఁచుచున్నది.

రావ— అట్లయిన మిగులఁ బ్రియంబు, మిగులఁ బ్రియంబు.

(తె ర లో)

చ. చిలువలతాల్పు దేవతకు శిష్యుఁడు భార్గవమౌని గండ్రగొ
డ్డలిమొన నిప్పుమంటల హుటాహుటి రాజులనెల్ల వేల్చి పే
ర్వెలసినవాఁడు వచ్చె గురువిల్ విరసించె నటంచుఁ గిన్కమైఁ
గలఁగుచు: రావణుండెచటఁ గ్రాలెనొ పూనుతఁ జంద్రహాసముఁ౯.

రావ— (విననియ ట్లభినయించి) మాయామయా! హాస్యంబులకై యనుచుంటివాయేమి?

మాయా— మహారాజా ! అసత్యముగాదు.

రావ— మదనతాపంబున నసిమిరియెత్తిన యీభుజదండమండలమునకుఁ గొంత వినో దంబుఁ గావించునుగాక.

మాయా— ఇదిగో ! పరశురాముఁడు సహహస్తాస్ఫాల్యమానమార్జనామనోహరంబగు రవంబుతో వచ్చుచున్నాఁడు.

(పిదపఁ జేత నమ్ము లాడించుకొనుచుఁ జాపధరుండగు పరశురాముఁడును శిష్యుండగు మాతరుండును బ్రవేశించుచున్నారు)

మాత— (తనలో)

గీ. భృగుకులంబునఁ బుట్టి పెంపెనసినట్టి
యితఁడెపో పుణ్యమూర్తి యదేల యనిన

నుపనిషద్వేదవేద్యుఁడైన పరతేజ
మింబుమీఱఁగ నాచార్యకంబుసేసె.

మఱియును మహాత్ములు తమసత్వసంరంభమును బ్రకటింపనివారగుకతంబున భీషణంబును రమణీయంబునగు నాకారంబు కలవారు గదా.

గీ. సర్పరాజంబుగల క్షీరజలధిమాడ్కి
ఘర్మమునమండుచుండు భాస్కరునిపగిదిఁ
దాపసుండయ్యు వీరుఁడై తనరునితని
భవ్యరూపంబు ముదమును భయముఁజేయు.

(ఆలోచించి ప్రకాశముగా) భగవంతుఁడా ! భార్గవ ! చ్యవనాదిమునీంద్రవచశ్శృంఖలావిసంస్థులంబగు నుపక్రమం బుపక్రమించినా వేమి ?

పర— (వినక మఱియొకవృత్తాంతము స్మృతికిం దెచ్చుకొని) ఆహా ! గురుకులంబునఁ బార్వతి నాయందుపచరించిన వాత్సల్యము !

గీ. తండ్రి వలదన్న మానక తల్లి పెంచి
నట్టి కైశ్యంబు స్నాతకం బైనపిదప
హరునిసేవయు మాని భూధరకుమారి
జటలు గాకుండ వేణిగా సంతరించె.

మాత— ("భగవంతుఁడా ! భార్గవ ! " యనునది మరలఁ బఠించుచున్నాఁడు)

పర— మహాబ్రాహ్మణ ! వీరవ్రతాచార మెఱుంగనివాఁడ వగుటచే నిట్లనుచుంటివి: ముక్తిమార్గ మెఱింగినవారికి వీరవ్రతమునందును బ్రహ్మానందము కలదు సుమీ ! ఇట్టిసమయంబునను నేను వీరవ్రతం బనుష్ఠింపక యుంటినేని—

శా. తా విల్విద్దియ నేర్చునాఁడు కచబంధం బూడఁగాఁ గట్టెఁ బ్రే
మావేశంబున గౌరి షణ్ముఖుఁ డసూయంజూడ: నాభార్గవుం
డే వెంటఁగనె పఙ్క్తివక్త్రకృతగుర్విప్వాసభంగం బనం
గా వింతౌనని యగ్గణంబులు నగంగా శూలి లజ్జింపఁడే.

మాత— అట్టి శిష్యానుగ్రహమే నన్నును బ్రేరేపించుచున్నది: అందుల కాచార్యులే ప్రమాణము.

పర— ("చిలువలతాల్పుదేవతకు") అనుపద్యము మరలఁ జదువుచున్నాఁడు"

రావ— ఓభార్గవా! బాగు! బాగు! నిజంబుగఁ బురారికి శిష్యుఁడవే యగుదువు.

ఉ. వారక యిందిరదంతికటభాగము నొయ్యన వ్రయ్యనేసి పెం
పారిన చంద్రహాసమునునైన గణింపక పోరవచ్చు బ

ల్వీరుని నిన్ను లోకనుతు విశ్రుతచిత్రచరిత్రుఁ గాంచుటన్
జేరిమి వీరమాతయని పేర్కొనఁగా నుచితంబ రేణుకన్.

పర— పులస్త్యగోత్రాపత్యమా! విఫలీకృతకృతాంతకోధహాసంబగు నీచంద్రహాసము మున్ను నీలకంఠసంతుష్టికై నీకంఠదశకంబుం దెగనరకుటంజేసి మాకతర్కిత వీరవ్రత ప్రఖ్యాపకం బయినదోయీ.

రావ— అవును! జమదగ్నిపుత్ర! సహజకరాళం బగు నీకరవాలమేనుమీ భూర్భువస్సు వర్లోకములనుగూడ నాపాదపీఠికయందుం దొర్లుచున్నట్టుఁ జేసినది.

పర— నిజముగా నీచంద్రహాస మట్టిదే.

గీ. చంద్రహాసంబుఁ గన్గొన్న సమయమందు
మరలఁదెగఁగొట్టునని భ్రాంతిఁ గెరలిపడెడు
నీతలల కట్లు శాత్రవనికరమూర్థ
ములకు నైతము కంపంబు పొడముచుండు.

రావ— భార్గవా! భార్గవా! వలదిటువలదు. ఇప్పుడు ఏమన్న నేమున్నది. అతీతవ్యవహారంబులు సాక్షిప్రత్యయపరతంత్రములు గదా!

చ. రమణగఁ జంద్రహాసము శిరాతతి తన్నునాదుగా మెడల్
గుమిగ బుజంబుదాఁకఁ దెగఁగొట్టిననాఁ డొకకంఠమేనిఁ గ
న్నామలను వంప దేవ్వదు కనుంగవకుం గడితేదు గద్గదిం
బ్రిమయదు నవ్వుమానదు ప్రమాణము శర్వుఁడె దీనికంతకున్.

పర— అహో! ఆత్మహత్య పాతకములలో మొదటిది. దానికే నీవింతఁగాఁ బొగడుకొనుచున్నావు! నీకు శాస్త్రముల యందుం గలపాండిత్య మింతదని తేటపడినది.

గీ. సూర్యతేజంబులేని వసుర్యములన
కటికచీఁకట్లుగల్గు లోకములు గలవు
ఆత్మహత్యయొనర్చువా రందుఁజొత్తు
రనివచించుట యెఱుఁగవే యాప్తవాక్కు.

రావ— ఓరీ క్షత్రియాపుత్ర! బ్రాహ్మణుండవుంబోలె వేదార్థము మీమాంసించుచు వేదత్రియమును బాడుచేయుచున్నావేమిరా! యీయపరాధంబునకై రాజగు రావణుఁడు నిన్ను దండించుఁజుమీ!

పర— (నవ్వి) అబ్బో! రాజుగారికింగలవర్ణాశ్రమధర్మవివేకము!

గీ. సకలలోకమువారికి జననిజాతి
తమకు ఘటియించు నంచు వేదములు సెప్పు;

నిగమవేత్తలు స్వాధ్యాయనిరతులునగు
తాపసులకెల్లను ఘటించుఁ దండ్రిజాతి.

రావ— నీవనినట్లయినఁ గావచ్చును.

పర— బడబానలంబునందుఁ గాష్ఠానలం బ స్తమించు టాశ్చర్యమాయేమి?

చ. హరునికరంబునం దునికియైనకతంబునఁ బూతమైగజా
సురుని వధించె నెద్ది పరశుప్రవరం బది సర్వశస్త్రికా
గురువగు దానితేజమునకుఁ సరిగాన జగానఁ గాన న
బ్బురముగఁ జంద్రహాసముఖముల్ తదురుప్రభ న స్తమించెడున్.

రావ— ఈకుఠారమా! మాచంద్రహాసంబునకు విలయంబుఁ జేయునది! భగవంతుండగు ఖండపరశుండు విరిగి ముక్కయిన యిది తనయొద్దనుండుట యమాంగల్యకరంబనియెంచి కదా నీకొసంగె. తపంబుఁ జేసికొనువాఁడవు గాన సమిత్కుశాదిహరణంబునకైన నుపయోగించునులే.

పర— ఔనురా! రావణ! భగవంతుండగుభర్గుని యనుగ్రహంబు స్మరింపంజేసితి వీకుఠారంబు తపంబుఁ జేసికొనుతఱి సమిత్కుశాదిహరణంబునకే కాదు యుద్ధం బొనర్చుతఱి దుర్మదరిపుకంఠకాండఖండనంబునకుం గూడ నుపయోగించును. చూడుము దీనిప్రతాపము.

రావ— శివునికరంబునం దున్నసమయమందు మాత్ర మీకుఠార మటువంటిదే. ముత్తెపుఁజిప్పలయందుం బడిననీటిబిందువులు ముత్తెములుగా మాఱున ట్లాధారము ననుసరించి యాధేయమునకును గుణాధిక్యము లభించునులే.

పర— నిశాచరచక్రవర్తీ! నీవన్నమాట సార్వత్రికముగాదు. సలిలగర్భంబునం బ్రతిఫలించినను సూర్యమండలంబు దురాలోకం బగుగతిఁ బరశురాముని చేతంబడినను నీపరశువు సారవంతమే యనుకొనుము.

రావ— అట్లే యొప్పుకొనియెద, దుర్నిషేధము కాదేనిఁ దల్లియగు రేణుకాదేవి తల యెట్లు ఖండింపఁగలవు ఓరీ! బ్రహ్మబంధువా!

గీ. ధరణిధరపుత్రి సొబగుటద్దంబు దంతి
దైత్యమౌళిమణీశాతధారము నగు
గండ్రగొడ్డలి రేణుకాకంఠరుధిర
శాదితంబుగఁ గని యేరు జాలిపడరు?

కటకటా! చంద్రశేఖరస్వామీ! తనశౌర్యంబు తల్లియెడంగూడఁ జూపునీక్షత్రియధర్మం బితని కేగురు వుపదేశించె! భార్గవా! మాతృవధం బొనరించినను నీవు నవ్వ

జనాదరణీయుండ వైతివి ఔరా! లోకయాత్రయెంత స్వతంత్రమయినది! లేక దుర్మా ర్గులకేనియు సత్పురుషసేవ యెంత ఫలప్రదము!

గీ. అమరవందితచరణాబ్జుఁ డైనచంద్ర
శేఖరుఁడు గౌరవము దయసేయకున్న
బ్రహ్మవర్చసవంతులు పజ్జనైన
నుండఁగానీరు పరశురాముండ! నిన్ను.

ఐనను నీతో నిట్లు పల్కుచున్నాను.

మ. ధనురాచార్యుఁగ నప్పురాసురనిహంతం జేరి, తత్కార్తవీ
ర్యునిఁ జక్కాడితి. వుంటి వమ్ములను నీయంజిమ్మి మున్నీటిభూ
మి నిదెల్లన్ శుభమైన రేణుకతలం బీడించి తాగంటుఁజెం
దిన నీగొడ్డలితోడఁ బోరు త్రపగాదే చంద్రహాసాసికిన్.

పర— నిసర్గదుస్సహంబగుపరశురాముని కుఠారముతోడ మార్కొంటకుఁ దలపెట్టిన
నీచంద్రహాసంబునకు సిగ్గెక్కడిది?

శా. రేవాతీర్థములందు నైకవిధనారీహస్తయంత్రోజ్ఝితాం
భోవల్లీతతినాడు హైహయుఁడు నిన్మన్నేమిగావించెనో
యావార్తల్ స్మరియింతె? రామభుజవాహ్యం బీకుఠారంబు త
ద్గ్రీవాబాహువు లేమిచేసె నదియెంతే కైకసీపుత్త్రికా?

ప్రతీ— (తనలో) రాక్షసులకుఁగూడ రాక్షసుఁ డున్నాఁడనుట యిదియే కాఁబోలును.

రావ— (నవ్వి) మనుజుండు రావణునకుఁ బరాభవంబుసేయువాఁ డనుటమాత్రము
చాల దొడ్డమాట. ప్రతీహారీ! ఋచీకపౌత్త్రుండగు పరశురాముఁడు యుద్ధముఁ
జేయఁదగినవాఁడుగాని వృథాదోషంబు లారోపింపఁదగినవాఁడు కాఁడు (ఆలో
చించి) శాత్త్రవులు దండమునకుం దగినవారుగాని సామముఁ బ్రయోగింపఁ
దగినవారు కారు (చేయెత్తి) భార్గవా! భార్గవా! నిశాచర చక్రవర్తి యస్త్ర
ములు దాల్పునివారిపై బాణము విడువఁడు. వీరవ్రతచరి తోత్రిక్కడ్డ కంత
రాయంబు లేదేని—

ఆ. వె. కరమునందు ఖండపరశుపరశ్వధం
బేని హరిశరాసమేని యిపుడు
తాల్పు; మంతదనుకఁ దాల్పదు నాచేయి
చంద్రహాస మోయి జామదగ్న్య!

పర— ఏమిది! సముద్రోదక పానంబునకై బడబానలంబుం బ్రార్థించునట్లు పరశు రాముఁడు సైతమిట్లు వచింపఁబడుచున్నాఁడు.

 మ. అమరుల్ వజ్రియు వెండికొండతలపైయుం జెక్కి దర్శింప మ
ధ్యమునం భర్గుఁడు పుత్రశిష్యకుల యుద్ధౌచిత్యముంజూడ దం
తిముఖుండుం బ్రమథుల్ సహాయులగువానిన్ స్కందు నోడించిన
ట్టి మహావీరునితోడఁ ద్వాదృశు లనిం డీకొందురే రావణా.

రావ— ఇయ్యది గురువున కొసంగందగిన గురుదక్షిణ గురుపుత్రున కొసంగితివి! గురువునందుంబలె గురుపుత్రునియెడ నడచుకొనవలయు ననునీతిఁ జక్కఁగాఁ జదివితివి కాఁబోలును.

పర— నీవెఱిఁగినట్లు క్షత్రియు లితరులెఱుఁగరు. గురువునందుంబలె గురుపుత్రుని యందుఁ బ్రవృత్తి నీకేకలదు. మేము శాస్త్రవాసన లేనివారము. మాపలుకిట్టివి,

ఉ. నీవును రాజరాజువలెనే నలకూబరుతండ్రివౌదు, రం
భావనతాంగి కీవు నలకూబరుఁడుంబలె మామవౌదు; విం
కావలిమాట నాకు హృదయంబున నుండియు బైటరాదు పా
పావహమౌట నిట్టు లనినందులకే శివు సంస్మరించెదన్.

రావ— ఒరులవిక్రమంబుసహింపలేనివా రేదియోయొకయపవాదయెదిరిపై మోపుచుందురు

గీ. గజముఖుండును నందియుఁ గమలవైరి
యును సహాయులుగాఁ గలరని కుమారుఁ
డకట నినుఁ దండ్రిశిష్యుండ వనియు వదలి
నంతనే నీవు విజయంబునందితోయి.

పర— దశకంఠా! అన్నా! పరశురామునివాక్కులయందును సత్యాసత్యవిచారము సేయు చున్నావు! నీకుఁభేదింపని వస్తువులును దురాత్ములదూషింపని మహాత్ములునులేరు.

గీ. హరుఁడు జనకుండు జనయిత్రి గిరికుమారి
వారితో నేమి మద్బాణదారితాగ్ర
చంద్రికంబగు నెమ్మిపింఛంబు బర్హి
వాహనుం డోడె ననుట కిప్పటికి సాక్షి.

రావ— ప్రత్యక్షప్రమాణమునే పరిగణింపని బుద్ధిమంతున కనుమానప్రమాణమున నా యాదరముండును! (కరమునందు ఖండపరశుపరశ్వధం బను పద్యము మరలఁ జదువుచున్నాఁడు)

పర— అపకారంబు సేయఁదలఁచియు నుపకారంబే యొనర్చితి. వేలన నీసంగతి స్మృతికి వచ్చినది.

మ. పతిచాపంబుఁ దిరస్కరించితని కోపస్వాంతయై యున్నపా
ర్వతివక్త్రంబున నైజకాంతి మగుడం బర్వంగఁ దచ్చాపధి
క్కృతిఁ గావింపఁగ మేటియైన కరమేదీ తెల్పు మీ గొద్దటన్
గ్రతుభుగ్బృందిక లందఱున్ బొగడఁగా ఖండించెదన్ రావణా.

అట్లుఁగాదేని యొక్కఁడపచారంబు సేసినఁ దత్సహచారు లందఱును నప చారంబు సేసినవారే కావున—

శా. కైలాసాచలచాలకంబులును సంగ్రామస్ఫురచ్చంద్రహా
సాలంబంబులు యుద్ధసంచకితరంభాలింగనానందధా
రాళంబుల్ భవదీయబాహులు కుఠారచ్ఛిన్నహస్తాగ్రముల్
గాలించుం దనువల్లి నిష్కమలనాళంబైననీరేజినిన్.

రావ— అట్లైని నిన్నుం జేరఁదీసిన ప్రమథనాథుండు దిక్కుమాలినవాఁడు కాఁడు భవానియు నవమానంబుచే వంచినతల నిఁక నెత్తగలదు. (ఆలోచించి)

ఉ. యక్షపతిం జయించి సురయానముఁ దెచ్చినజెట్టి దేవతా
ధ్యక్షుని బందిపెట్టిన మహాభుజుఁ దమ్ములసంచి వల్కలం
బక్షపుమాల గొడ్డలి శరాసనముం గల మౌనితోడనే
కక్షవహించెనా యని పకాలున నవ్వు దశాననంబులున్.

పర— బలివధూపరీక్షితపరాక్రముండ వగునీవు మావంటివారలను మౌనులని యాక్షేపింపవలసినదే.

మ. మునుపాతాళమువంక కేగుటజీ నాముం బాపఁగా న వ్విరో
చనుకోడండ్రురు వేడ్క నీతలలపైఁ జప్పట్లు వాయించుచున్
నిను నాడించిరి చేతులంద వికసన్నీలోత్పలాకారలో
చనలై జ్ఞప్తికివచ్చునే యిపుడు తత్సందర్భముల్ రావణా.

రావ— ఆఁ, అంతయును యథార్థమే. భార్గవునిపగిది రావణుఁ డాఁడువాండ్రపై భుజశక్తిఁ గనఁబఱచువాఁడు కాఁడు.

పర— రావణునిపగిదిఁ బరశురాముఁడును జతుష్పాజ్జంతువులపైఁ బౌరుషంబుఁ జూపఁజాలినవాఁడు కాఁడు.

ఉ. కోఁతిగదా సురాధిపునకుం దనుజుండగువాలి చంకలో
నీతలలన్నియుం దిగిచి నీరధు లన్నిటియందు వార్చునాఁ

దూ(తములేక యూర్పెడల కుక్కి(రిబిక్కి(రియౌ మొగాలతో
నేతడవుంటివోరి రజనీచర యెవ్వరెఱుంగ రింతయున్.

రావ— (క్రోధహాసములతో) మూఢబుద్ధులు చెప్పినసంగతియే తెలిసికొనలే రిఁక సత్యా సత్యము లెట్లు వివేచింపఁగలరు.

క. నగమాఁడుది నగము మగండగు శంభునివిల్లె విఱచు టనభిమతం బీ
జగతీవీరున కింక వడుగుపయి వానరముపయిఁ బడునె యంపగముల్.

పర— దశాననా ! యిట్టి యద్వాతద్వావాక్యంబులతో నేమిప్రయోజనము ! భార్గవుండు వీరులవిషయమై జాతిపరీక్ష సేయఁడు.

క. పురుషునకెపుడుఁ బ్రతిష్ఠాకర ముత్తమచరిత మగునుగాని కులముగా
దరయుము కుంభభవుఁడు సాగర మాచమనంబుసేసి కనఁడేకీర్తిన్.

రావ— ఓరీ ! దుర్ముఖ బ్రహ్మచారీ ! వైఖానసపక్షీ! ప్రతారితపురాంతకాచార్య ! పరశుధారానికృత్తజననీకంఠసీమా! మూర్ధాభిషిక్తమూర్ధరుధిరజలనివాపాంజలి తర్పితపితృకా ! క్షత్రియాగర్భపాతనమహాపాతకీ ! ఇదిగో! దశాననుండ స్వదోర్దండసామర్థ్యముం జూపించుచున్నాఁడు.

గీ. మాతఁ జంపినయట్టి నీమస్తకంబుఁ
దూఁడు నఱకినరీతిగా నూడనఱకి
వికృతిఁ గావించుకొను మరున్నేతృమౌళి
శాతధారము చంద్రహాసము కడంగి.

చ. కలితజయాంకవర్ణములుగా సురదంతిశిరంబునంద యే
టులిడిన చంద్రహాసము వటున్ నిను పొఱుని జంపునే? యటు
ల్నిలుపుము వామపంచకకనిష్ఠకలాంగుళులం గనిష్ఠికాం
గుళినఖమే భవచ్ఛిరముఁ గూల్చు రణన్నిగమంబు వంచకా.

పర— రేరేపునరుక్తాకార ! దురాచార ! నిశాచరాధమ ! విరించికులకలంక! బంకోపపతీ! కుబేరశాత్రవా! పాతకీభూతకరాసీ ! అభిలషితరంభాపరీరంభా! దాక్షాయణీప్రణామపరిహారీ! ఏదీ నీదోర్దండమండలీ సామర్థ్యముఁ జూపుము.

రావ— (నవ్వి) భార్గవుఁడు రావణునిబలంబును దనబలమువంటిదే యనుకొనుచున్నాఁడు కాఁబోలును (తెరవంకఁజూచి) పుష్పకమా! యిటురమ్ము

పుష్పకము— (ప్రవేశించి) ఇదిగో వచ్చితిని

రావ— (నగమెక్కియు నగమెక్కనిగతి నభినయించును) అహాహా! వీరులకు ధర్మము గాని యాచారము చపలంబించుచున్నామే (అని దిగఁబోవుచున్నాఁడు.)

పర—

ఉ. ఈయన పాదచారి యయియే యనిసేయఁగ నే నిటుండుటల్
న్యాయముగా దటంచు సురయానము డిగ్గకుమో దశాస్య! క
ర్ణాయతనేత్రి లప్సరస లందఱుఁ గ్రిందికిఁ బైకిఁ గ్రిందికిన్
దాయు శరంబులం గని ముదంబువహించుచు నుంద్రుగావుతన్.

రావ—నీకు యుద్ధ మభ్యస్తమైనదిగాదని యిట్లు రావలఁచితినిగాని వేఱొండుగాదు

పర— పశుపతియు ననుగ్రహింపనినన్ను నీ వనుగ్రహించెద వేమీ, నీకరుణ! నా కభ్యాసములేదని యేల నుడివెదవు.

గీ. నీవు నేర్చినకోలఁదిగ నీశరంబు
లేగు నంతకు హెచ్చుగా నేగలేవు
హరునిశిష్యుండ నైన నాయంబకములు
సకల దిక్కుల కేగు నిస్సంశయంబు.

రావ— అట్లైన యుద్ధంబుసేయుతఱిఁ బురారి నీకుసాహాయ్యం బొనర్చును గాఁబోలు! చేయనీ. (ఇరువురును శరములు ప్రయోగించుటకు నుద్యుక్తులగుచున్నారు. అంతట సశిష్యులగు ఋచీకపులస్త్యులతో భృంగిరిటుఁడు ప్రవేశించుచున్నాడు.)

శిష్య— (ఎదుటఁజూచి) అఖండపిండితశిఖా సంఘాతచండీకృతచిత్రభానుబింబంబు లును దక్షిణోపనతదాహోత్తరణతారతరజాత్య కాంచనమయకేతుదండంబు లును నమందస్వచ్ఛందసంపతితజటిలజ్వాలావళీ ప్రక్షాళన సవిశేషసముజ్జ్వల దగ్ని రాశిచయసంస్థితధ్వజపటాడంబరంబులును విబిడోష్మప్రాగ్భారభారపరిగ మంబునందును నమ్లాయమానసరసోత్పలావిచ్ఛిన్న కోకనదపరికరంబుచే విరా జమానంబులు నగువిమానంబు లట్టిటుసంచరించుచున్నవి: ఇది యేమీవింత!

ఋచీ— నాయనా! దాక్షాయణ!

చ. గగనము సర్వమున్ మెఱుపుగప్పినరించినభాతి నుండె నిం
పుగ మణిదేవయానముల మోసల మేల్కిటికీలలో మెడ
ల్దిగిలిచి చూచుచుండిరి బుధప్రమదల్ మనకుట్ల లిర్వురున్
జగడములోన నగ్నిమయశస్త్రములం బరఁగించిరేమొకో.

పుల— (బాగుగఁజూచి) సఖా!, ఋచీక! నాయూహాయు నీయూహనే యనుసరించినది.

చ. ఒలసెడు నొక్కచో నొకఁ డిఁకొక్కయెడం బడి, యిట్లులోకము
ల్గలఁచుచు నేకమై పడునొకండు ధనుర్ధ్వను లాలికించితే

కలనువౌనర్ప రాముదశకంఠులు చొచ్చిరటంచు నెంతుఁ బే
శలకుశనిర్జరీకుచ కచగ్రహచంగములైన చేతులన్.

శిష్య— అమందసిందూరసుందరిత కుంభస్థలప్రాగ్భారభాసురంబులును బ్రచండముం డమండలీమండితశుండాదండ డంబరోడ్డామరంబులును బ్రవృత్తమదధారా ధోరణీ నిరుద్ధరేణురమణీయమార్గంబులును గళగుహనికుంజపుంజితనిర్జితజలద జాల స్తనితవిస్తారంబులును నగుగజసముదాయంబు లట్టిటు సంచరించుచున్నవి.

భృంగి— భద్రి! దాక్షాయణ! బాగుగ నిరూపించితివి! రావణుండు వారణాస్త్రంబుఁ బ్రయోగించినాఁడు. ఏలన:

చ. గులగులలాడు పెంగళపుఁగూఁతలు మ్రోఁగఁగ డిండిమధ్వనిం
దలఁకుచు దర్పహేలలు సదా చెలువారఁగ మావటీండ్రతో
మొలయుచు నంకుశద్విగుణమూర్ధములం దనరారు దంతిప
జ్క్తులొ చవె లోలకేతువులతో జలశీకరపూరితాశలై.

శిష్య— ఉత్తుంగలాంగూలాగ్రసమాలింగిత గగనోత్సంగంబులును ఘనఘోణఘుర ఘురాఘోషఘుర్ఘరితగళగుహాకుహరస్ఫారపుల్లగల్ల వ్యతికరంబులునువిద్యుత్పిం జపింజరితదృష్టిచ్ఛటా కటాక్ష దుష్ప్రేక్షంబులును నగుసింగంబు లివిగో వచ్చు చున్నవి.

పుల— వారణాస్త్రప్రతిద్వంద్వియగు పంచాననాస్త్రమును భార్గవుండు ప్రయోగించె నని తోఁచుచున్నది.

చ. గురిజపుఁగాంతి కన్గవలకుం జెలువీఁగ సటాచయంబు గం
ధరముపయి న్నటింప మెయి నాణెపుఁబింగళకాంతి మీఱ ఘు
ర్ఘురఘుర మ్రోఁగు పెన్రొదలకుజ్ జగమూఁగఁగవచ్చుచుండె భీ
కరనఖరాళితో గజహకాండము నిండుచు నంతరిక్షమున్.

(భావగర్భితముగా నందఱును) ఇట్టిటు రండు! వీరాగ్రగణ్యులగు నీవీరుల యిరువుర మధ్యమున వసింతము.

ఆ. వె. విండ్లు పదియుఁగూడ విడువు మోదశకంఠ?
దురము మానుమయ్య పరశురామ!
యుద్ధభూమి మీర లొండొరుల్మార్కొంట
కొదఁబడంగఁబోఁడు చుఁడు పురారి.

రావ— అక్కటా! యిది దహించుచున్న దావాగ్నికి వానజడి గదా.

గీ. భార్గవుం డనియును దశవదనుఁ డనియు
రెండు తెఱఁగులఁ బాఱు కీర్తిప్రవాహ
మేకముఖముగఁజేయ నేనిహ సేయఁ
జంద్రఖండధరుం డెటుసమ్మతించు?

పర— (తిరస్కారముతో)

మ. గురుచాపంబుఁ దిరస్కరించె ననుమం గోపంబురామాన దీ
శ్వరుఁడే నందిముఖంబునం దురము మాన్పంగా నియోగించె మ
త్కరణీయం బిఁక నేది? నీయెడకు మార్గం బిచ్చి కొంపోఁగదే
ధరణీ! గొడ్డలి నన్నుఁగాల్పుము మహాత్మా! కాలవైశ్వానరా!

రావ— ఈశ్వరనియోగంబునంజేసి మనము మిత్రులమైతిమి. కావున మహాత్మా! సెలవొసంగుము.

(తెరలో)

భగవంతుఁడా! భార్గవ! పరబ్రహ్మధ్యానము సేయుచున్న పూజ్యురాలగు నాత్రేయితోడను లోకయాత్రాపరతంత్రాత్మయగు కాత్యాయనితోడను సూర్యశిష్యుండు నిన్నిట్లు ప్రార్థించుచున్నాఁడు.

గీ. హరునిశిష్యుండ! మాయింటి కతిథివైతి
దారలును మేము నగ్ను లీదాఁపునంద
గాఁపురంబుంటిమయ్య! రాఁగదవె వటుచ
యంబునకు నేఁ దనధ్యయనంబుగాఁగ

పర— సూర్యాంతేవాసి యానతిచ్చినట్లే యొనర్చెద.

(అని యందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది

శ్రీ....తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బగునాంధ్రీకృత బాలరామాయణమునందుం
ద్వి తీ యాం క ము.

శ్రీమత్పరదేవతాయైనమః

# బాలరామాయణము

## తృతీయాంకము

(పిదప సువేగా చిత్రశిఖండులను గృధ్రమిధునము ప్రవేశించుచున్నది)

చిత్ర— ప్రియురాలా! సువేగా! భగవంతుఁడగు తామరకంటికి సిడంబును బాములకుఁ బగవాఁడును సుధాహరణవిదితపరాక్రముండును బతత్త్రికులసార్వభౌముండును మనకుఁ గూటస్థుండునగు వైనతేయుని యేల్బడికి లోఁబడిన పక్కికోలంబులలో నెక్కువ యశంబు నిక్కువంబుగా గాంచఁదగువానిఁ గుమారునిఁ గడుపున భరియించి యుంటివిగానఁ దదనుకూలంబుగ రక్కసుల పొలయును నెత్తురును నీకు దోహదం బగుసమయంబు తటస్థించినది.

సువే— ఓచిత్రశిఖండా! ముల్లోకంబులు జయించి మించుచున్న రక్కసులతేఁడగు దశకంధరుండు జీవించియుండగానేనా!

చిత్ర— అది దొరకుట సామాన్య మయినపనియా! ఏమి! నిజముగా నతనిపేరే రావణుఁడు.

ఉ. ఆఁడుదియంచు హైమవతికైన నెవండు నమస్కరింపఁడీ
రేడుజగంబు లెవ్వనియహీనవిభూతికి సాక్ష్యమిచ్చు నె
వ్వాఁడు జగద్విధాతయగు బ్రహ్మకు ముమ్మనుమండఁ డేరి నో
రాడును వాని నెన్నియుఁ దదన్యుల నెన్నుటకై పతత్రిణీ.

ముత్తెంబులు లతలయం దుదయించు నసుకాలము గతించి యాలిచిప్పలయం దుదయించు ననుకాలము తటస్థించినది! ఏలన, రామభద్రుండు, తాటకనుసంహరించెనని వినియు నాదశాననుం డింకను దనబాహుమదంబునకుం దగిన పను లాచరించుచునే యున్నాఁడు.

సువే— పతత్త్రికులాలంకారమా! రామచంద్రుం డానుందసుందరి నెట్లు వధించెనో యాయుదంతము రవంత చెప్పుము.

చిత్ర— ప్రియురాలా! ఒకానొకనాఁడు విశ్వమిత్రుండగు విశ్వామిత్రుండు మఖ

సంరక్షణార్థంబుగా దశరథకుమారులగు రామలక్ష్మణులను సాకేతపురినుండి సిద్ధాశ్రమమునకుంగొంపోయి యొకవంక నుద్గాత సామవేదపారాయణం బొనర్చుచుండ నొకచెంత హోత హోమం బాచరింప నొకవంక నధ్వర్యుఁడు సప్తతంతువిధానంబు నెఱవేర్ప నొకయోర యజమానుఁడు యాజమాన్యంబు లుచ్చరింప నొకదెస బ్రహ్మ కర్మలోపంబు గాకుండఁ బరీక్షించు చుండ జన్నం బొనర్చునప్పుడు సూర్యాచంద్రమోవీతిహోత్రరమ్మదవ్యతి రిక్తంబగు నొక పెనుమంట పుట్టినది.

సువే— ఏమివింత యేమివింత : తరువాతఁ దరువాత ?

చిత్రి— పుత్రమిత్రకళత్రంబుతోఁ బెక్కుదెసలనుండి వచ్చినజడదారు లిదియేమి యనుభయంబునఁ బాఱిపోవ నచ్చటిజను లిట్లు ఘోషించిరి.

సీ. పొలదిండివేళను సెలవుల జాఱిననెత్తురు కెడల ఘనీభవింప
గండదేశవ్యతికరమున మిగుల ఫీత్కారంబుచేత జగంబు లదరఁ
జిఱుతలగతి రెండుచేతుల మ్రోఁగించుశవమాలపొద చటచ్చటని వెడలఁ
గండనంజుడు నోటఁగఱచి మెసవువేళఁదల్పులగతిఁ కాకుదములు కదల

గీ. ఘటితదంష్ట్రాంకురచ్ఛటాకషణజనిత
రణరణత్కారభయదసంరావముఖర
తాళవృక్షోపమాకార తాటకాభి
ధానరక్కసి చనుదెంచె దండకదిగా.

సువే— హా ! హా ! ఈవచ్చినది భయంకరులకుఁగూడ భయంకర యనవలయు.
తరువాతఁ దరువాత ?

చిత్రి— అట్లు చనుదెంచిన తాటకం గాంచి విశ్వామిత్రుండు దానిం జంపుటకై
రామభద్రునే నియోగించెను.

సువే— అయ్యో ! భగవంతుఁడయ్యు విశ్వామిత్రుఁడు చేయరానిపని చేసెను గదా.

చిత్రి— పిదప రామచంద్రుండును స్త్రీవధంబునకై సంశయించుచు నమ్మునిచంద్రున
కిట్లనియె.

చ. నను( గరుణింపుమా ! కుశికనందన ; దాఁసుడ నాఁడువాండ్రఁ జం
పను శరమెత్తికోలు రఘువంశ్యుల ధర్మము గాదు; మంత్రవే
దిని జడదారి నొక్కని సతీర్థజలాక్షతపాణి నిందుఁ బం
పిన నతఁ దేపుమాపు నడపీనుఁగురక్కసి నొక్కప్రేల్మిడిన్.

ముని— ఏమి! ఈరఘువంశకుమారుని యౌచిత్యము!

చిత్ర— ఇట్లు నుడివిన రామభద్రునిం గని శిరంబు మూర్కొని చిబుకంబెత్తి ముద్దు పెట్టుకొని రాచపాపం డిట్లుపదేశించె.

గీ. కాలమునఁగాని ఘోరంపుఁగాళరాత్రి
గాని యాఁడుదిగా దాశుగంబుఁదొడిగి
సంశయింపక నాతండ్రి! చంపుమయ్య
ముజ్జగంబులు సంతోషమునను బొంగ

చిత్ర— పిదప మునివచనంబులు త్రోయలేక జగదేకవీరుండగు నారఘువంశాంకూరంబు క్రూరంబగు నాశుగంబు వింటం బూరించి పఱపినంతట సౌమిత్రి ధామున కిట్లనియె:

గీ. ధ్వస్తహస్తంబు దళితాంత్రతంత్రచయము
గళితరక్తంబు ఖండితకాలఖండ
మగుచు ధరఁగూలె జడదారు లద్భుతపడఁ
దాటకాదేహ మార్యసంతాడితంబు.

ముని— పసితనమైనను బహుమఁదనపురాఘవుం డొనరింపఁదగిన పనిచేసెను రామభద్రుఁడు! తరువాత?

చిత్ర— పదంపడి త్రిశంకుశోకశంకుపరిహర్త సుందాసురసుందరీ వధంబున కాశ్చర్యపడి—

గీ. తనకుమున్ను కృశాశ్వుఁడత్యంతమోద
మొదవనిడిన ధనుర్వేదమది సమంత్ర
కములుగా వెల్గు జృంభకాస్త్రములతోడఁ
గరుణనప్పుడు రామలక్ష్మణుల కొసఁగె.

ముని— దేశకాలపాత్రంబు లెఱిఁగి తగినకార్య మొనర్చుటకు నీభరతమాతామహునకే తగును.

చిత్ర— తాటకం జంపినకతంబునం దేటతెల్లంబయిన పరాక్రమంబుగల రాఘవునకుఁ దనధనుర్వేదమంతయు నుపదేశించిన యాశకుంతలాజనకుండు జన్నంబు యథోక్తముగా నిర్వర్తించి హరుశరాసనంబు గూడ విజీపించి సీతం బెండ్లి చేయింపఁ దలంచి యానిసువుల నిరువురఁ దోడ్కొని మిథిలాపురంబున కరిగె.

ముని— తరువాతఁ దరువాత.

చిత్ర— ఇట్లమ్మువ్వురును మిథిలాపురంబున కరుగుచుండ మధ్యేమార్గంబునఁ దాటక కొడుకులు మారీచసుబాహులనువారడ్డంబువచ్చి యుద్ధంబునకుందలపడిరి.

సువే— దుష్టులగునాతాటకేయులు మంచివానితో వైరంబు పూనిరిలే పదంపడి వారికి జరిగిన మహోత్సవ మేమిటి?

చిత్రి— తల్లికిజరిగిన మహోత్సవమే జరిగెను.

క. పదితేరులదొరకొమరుఁడు వదలినశర మాసుబాహు వ్రక్కలుసేసెన్
దదనుజు మారీచునిఁ బడఁబొదివెన్ దనపక్షవాతముల నక్కడలికా.

సువే— ఇఁక రామ యనునక్షరంబులు రాక్షసవినాశకరము లనవలయు.

చిత్రి— ఆహారం దొరకిననెత్తురును బొలయు నీకు దోహదం బగుఁగాత.

సువే— నాథా! ఇట్లుపలాలించుచు మదీప్సితం బొడఁగూర్చుచున్న నీవలన సకల పతత్రి సీమంతినీమాననీయ సౌభాగ్యగౌరవ నయితినిగాని నామది నొండొక సంశయంబు బాయకున్నది.

చిత్రి— ప్రియురాలా! ఆజ్ఞాపింపుము.

సువే— దశాననుం డిట్టిరాక్షసావమానంబు సైఁచి యెట్లున్నాఁడో!

చిత్రి— పతత్రిణీమణీ! సీతావిషయికం బగువిరహంబు వానిం బట్టుకొని పీడించుచున్నది. లేకున్న నెన్నఁడును సర్వావమాని యగురావణుం డిట్లూరకుండఁడు మంచులేకున్న సూర్యుండు చల్లఁబడునే.

సువే— అట్లైన వాఁడాసీతావిరహదుఃఖంబు బాపుకొన నేమేమి వినోదోపాయము లాచరించుచున్నాఁడో?

చిత్రి— త్రికూట పర్వతమునం గలపక్షులకు రాజై సర్వదా లంకయందుండు నీ మఱఁది యగురత్నశిఖండుఁడు నిన్ననేకదా చెప్పిపోయెను.

సువే— ఏమి చెప్పిపోయెనో నేను వినలేదు.

చిత్ర— అట్లైనఁ జెప్పెద నాలింపుము.

చ. అవనిజమోముతోడ సరియైన శశాంకుఁ డొకండు సీతక
న్గవ కెనయైన యుత్పల మొకండును మైథిలి నవ్వుతో సమం
బవుబిసజాల మొండును దశానను నూరడఁబల్కఁ దత్తరు
ణ్యవయవసామ్య మందినపదార్థము లన్నియు వేయు నేటికిన్.

మఱియును సీతావిరహపీడితుల మగుమాకు వినోదాంతరమిదియొకటి యిపుడు లభించినది. భగవంతుఁడగు దేవేంద్రుని యానతిచొప్పున భరతాచార్యులవారు సీతాస్వయంవరకథాసంబంధిగా నొకనాటకమును గ్రొత్తరచించిరట. దేవసభలో దానియాటకూడ జరిగినదట! అదితెలిసి రావణుఁడు మాకుఁగూడ దానిఁ జూపవల

సినదని యాజ్ఞాపింపఁగా భరతాచార్యులవారు తమ పుత్రుల నూర్వురనుగూడ నప్స రసలతో లంకకుఁ బంపిరి.

సువే— అట్లైన రమ్ము. మనమును మనరాజధానియగు వింధ్యగిరికింబోయి యట సురక్షితంబగు నీడంబునం బ్రవేశించి మఱియును దోహదము సంపాదించు కొందము. (యాగృధ్రమిథునము నిష్క్రమించును.)

(పిదప రావణుఁడును బ్రహస్తుఁడును బ్రవేశించుచున్నారు.)

రావ— (విరహతాపం బభినయించుచు) హృదయమా! నీయదృష్టము మంచిది. సీతాప్రతిబింబ విలోకనం బైనను నీకుఁ దటస్థించినది.

(తెరలో) త్రిజగత్పతీ మహారాజ! దశానన! నీకు జయము. నీకుజయము. సాయంసంధ్య దేవరకు సుఖప్రద మగుఁగాత.

మ. ఎఱు పద్దించిన పట్టునూలువలె నెంతే మీఱు నుసాగ్రితో
నెఱసంజం గుడిగూర్చుకొంచుఁగనుఁగొంటే పూష యస్తాద్రిపెం
జఱియణ్ వ్రాలె నొకింతమున్నేఁబయిఁ దేజంబాఱ వారాశి గ్రి
చ్చఱ వాత్యాదళితాంబుజాతజరజశ్చక్రాయమాణాకృతిన్.

రావ— నాపుణ్యవశంబున నేఁటికిఁ బవలు గడచినది! ఓప్రహస్తా! భరతాచార్య పుత్రులను నాటక ప్రదర్శనంబునకై రప్పింపుము.

ప్రహ.(తెరవంకంజూచి) ఓభరతపుత్రులారా! నాటకముఁ గనుంగొన మా చక్రవర్తి గారు సన్నద్ధులైనవారు గాన వేగ రండు.

కోహలుఁడు— (ప్రవేశించి)

గీ. మండిపోయియుఁ గర్పూరఖండపట్టు
జనులయందెల్ల నెవఁడు వాసనలుగొల్పు
నతని శృంగారరసమున కాదికార
ణం బయినవానిఁ గుసుమధన్వునదలంతు.

రావ— ఇది నాంది. ఇంకఁ బ్రస్తావింపగలఁడు.

కోహ— పూజ్యుఁడగు విధాత మానససంభవులలో మొట్టమొదటివాఁడగు భరతా చార్యుండు రచించిన సీతాస్వయంవరమను నూతననాటకముం బ్రయోగించు చున్నారము! పరమేష్ఠివలన నాట్యవేదంబును స్వపౌరుషసంతోషితుం డగు హరునివలన లాస్యతాండవంబులను నేర్చుకొనిన దేవర మానృత్యాభినయం బులు చక్కఁగ నవధరించుగాక యని వేఁడుకొనుచున్నారము.

క. విన(బెక్కు-చెవులు(, జూడ గ్గనులెన్నో వలయునట్టి నాటకమిది చే
సెను భరతు(డు దేవరకొఱకనియే మే మెల్ల( దల(పనగు దశవదనా.

రావ— ఏమిది ! అసంబద్ధప్రలాపములాడెదవు ! రావణు(డిక్కడ నుండ(గా నింక
సీతను బెండ్లియాడువా(డు వేఱొక(డెవ్వ(డురా. (ఆలోచించి)
కానీ ! కవివాక్కులు నిరంకుశంబులు.

కోహ— (అంతట(జూచి) ఔరా ! రాక్షసచక్రవర్తిప్రాభవము త్రిభువనశిరశ్శేఖ
రాయమాణమై ప్రకాశించుచున్నది.

సీ. రిక్కమొత్తము తేజరిల్లుచొందొంటితో ముత్యాలజాలలై పొల్చెనిచట
నిల్వుటద్దంబులై విల్చిరిం దందందు ద్వాదశాదిత్యులు తైక్ష్ణ్యముడిగి
చంద్రమోబింబంబు చలువలల్లార్చుచు నుల్లాభమైమీ(దనొప్పుచుండె
సంజకెంజాయలు సాంద్రసిందూరరేఖల( దీర్చుచుండెరంగస్థలమున

గీ. నందపవనంబులెల్లెడ మలసి మలసి
శ్రమజలంబెల్ల నల్లంత(జల్లనార్చు
గొప్పతాలవృంతంబులై యొప్పుచుండె
బాగురేవా(గు రావణేశ్వరునిబాగు !

ఓరావణసభాసదులారా ! పూజ్యు( డగుభరతాచార్యుం డిట్లు పలుకుచున్నా(డు.

శా. మాధుర్యంబును గర్ణపేయముగ నిర్మాణించు వైదర్భియున్
సాధుస్వాంతమనోహరం బగుకథం జాటించుసూక్తుల్ రసా
ర్ణోధిన్ నించెడుసుప్రసాదగుణచంద్రుండుం జెలంగం బ్రమో
దాధారం బగుకైత శారదకు నిత్యావాసమై యొప్పదే.

క. శ్రవణంబునకుం దగినది సువర్ణబద్ధంబు కలితసుచ్ఛాయం బీ
కవనము దా ముత్తెపుజంపువిధంబున( బ్రమద మొస(గు బుధులకు నెందున్.

( తెరలో( బాడుచున్నారు. )

క. ప్రకటితరామాబ్జము కౌశికవంతము లక్ష్మణప్రసిద్ధంబు( బురాం
తకచాపదమనకారణ మకలంకము వచ్చె శరద మతిసుఖమొదవన్.

ఇదిగో, రామలక్ష్మణసహితవిశ్వామిత్రప్రవేశసూచకంబగుధ్రువాగానముచేయు
చున్నారు గాననేనును దక్కినపనులకై యత్నింతు (నిష్క్రమించుచున్నా(డు)

( ఇ ది ప్ర స్తా వ న. )



(పిదప రామలక్ష్మణులతో విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విశ్వా— అహా! జనకునిమనంబు సర్వదా పరబ్రహ్మానుసంధానమే చేయుచున్నది. ఇది యంతయు యాజ్ఞ్యవల్క్యుని సామర్థ్యము. నెలఱాలు కరంగెననుటకుఁ గారణము చందురునిసామర్థ్యముగాని యన్యంబు గాదు గదా.

రామలక్ష్మణులు— భగవంతుఁడా! ఉపాధ్యాయ! ఇతఁడేనా జనకమహారాజు? సూర్య శిష్యునివలన శుక్లయజుర్వేదము సైతముఁ జదువుకొని విరక్తుండయ్యును నేల వనమునకుఁబోలేదో

విశ్వా— నాయనా రామచంద్ర! తండ్రీలక్ష్మణ! రాజ్యాశ్రమమహాముని యీతఁడు దీని నిట్లు సమర్థించుకొనుచున్నాఁడు.

చ. అడవులనుండఁగావలె మృగాదులతోడఁ జరింపగావలెన్
గుడువవలెఁ ఫలాదులను గొండలనీఱలు గ్రోలఁగావలెఁ
బడుకొనఁగావలెఁ గఱకుబండలఁ గామములూడ్పఁగోరువా
రుడిగినవారి కిల్లయిన నొక్కటె కాననమైన నొక్కటే.

రామ— ఇది నిజమే. ఇట్టివారుగాని యట్టిరహస్యమును దెలిసికొనలేరు.

రావ— (సాక్షేపముగా) వీఁడె! దశరథపుత్రుఁడు రాముఁడు! వీఁడు తాటకను, దాటక కొడుకులను జంపినవాఁడు! (మునివంకఁజూచి) అన్నా! ఈరాచపాఱుని యభిచారచాతుర్యము! అస్మత్పరిజనులందుఁగూడ సాగింపఁ దొడరినాఁడే! అవురా! యీరాచకుఱ్ఱఁడు గూడనా! ఏమి! వీని కుఱ్ఱవనపుఁ బొగరు!

లక్ష్మ— ఇదిగో! హరశరాసనము. అప్పుడే సీతాస్వయంవరమండపములోనికి వచ్చినాము.

ఉ. బంగరుమువ్వ లెల్లెడ నభంగుర మౌగతి మ్రోఁగ గోపురో
త్తుంగవిచిత్రరత్నరుచితోఁ దులఁదూఁగుచు వేల్పు టేనివి
ల్బంగిఁ జెలంగి నింగి సురలం గనుఁదమ్ములు వ్రిల్చునట్లు చే
యంగల మంచసౌధములయందు వసించిరి రాజపుంగవుల్.

విశ్వా— (అన్నివంకలకుం జూచి)

గీ. దేవదేవునివిల్లిది త్రిపురవిజయి
యితఁడు జనకుండు భోగి యోగీశ్వరుండు
నితఁడు జనక పురోహితుం డీవెలంది
పుణ్యయజ్ఞనసముద్భవ పుడమికాన్పు.

(అంతటఁ బురోహితునితో జనకుండును చెలులతోసీతయుఁ బ్రవేశించుచున్నారు.)

శతా— ఓ సీరధ్వజా! నేఁడు తాటకావిపాటనుండగు రామభద్రునిం జూచిన నతని తండ్రి బాల్యావస్థ స్మృతికి వచ్చుచున్నది సుమీ! ఏలన నాదశరథుండును.

గీ. గద్దమును మీసలును రానికాలమంద
పవిధరుండగు దేవతావల్లభునకుఁ
జెలి యగుచు దానవులనెల్లఁ జెండి దైవ
తంబు రాజ్యంబు నిష్కంటకంబు సేసె.

జన— అవును! ఇక్ష్వాకులవిక్రమంబులు వయఃప్రక్రమంబుల నపేక్షించునవి కావు.

శతా— హేమప్రభా! స్వయంవరసమయ మాసన్నమగుచున్నది గాన జానకిని హరశరాసనసమీపమునం గూర్చుండఁ బెట్టుము.

(అంత హేమప్రభ యట్లు చేయుచున్నది.)

విశ్వా— వత్సా! లక్ష్మణ! అదిగో జనకునిసమీపమునం గలమంచముపై రామభద్రు నెక్కించి నీవును గూర్చుండుము.

(అంత సౌమిత్రి యట్లు చేయుచున్నాఁడు)

రామ— (తనలో) పుడమి తల్లియు యాగస్థలంబుపుట్టిల్లును శివధనుర్భంగం బోలియు, గాఁగల కన్యక యీమెయే కాఁబోలును.

చ. నలుదెసఁ బూర్తిగానురమునం గుచయుగ్మము నిండలేదు, క
న్నుల కొకవింత పుట్టియుఁ గనుంగొనుదాఁకన యుండ దౌ, పిఱుం
దులును నితంబలక్ష్మిని నెదుర్కొనుచున్నటు లున్న విప్పుడే
యలముచునుండెఁగా ప్రథమయౌవన మీచిగురాకుఁబోఁడికిన్.

(ఆలోచించి) హృదయమా! ఇఁక మన్మథుం దస్ఖలితశాసనుండు కాఁగలఁడు.

గీ. ఇం చయిననేమి వెదురైననేమి చాప
మాయసము లైననేమి పూలైననేమి
తూపు లీముజ్జగములందుఁ దుంటవింటి
వాఁడె విల్కాఁడు సీతకు వయసు వచ్చె.

(బాగుగ నాలోచించి) నూతనాలంకారరచనావిలాసవ్యగ్రభావయగు నీలతాంగియే జవ్వనము నలంకరించుచున్న దని తలంచుచున్నాను.

మ. కబరీపాశము దిద్దునేర్పులును వక్రింబుల్ కురుల్ తిన్నఁగాఁ
గ బనాయించు తెఱంగు దంతచయముం గైసేయుసామగ్రి ప
ల్కుబహూకారము నీవిసన్న హనముల్ మున్నైనచెయ్దంబు లీ
యబలల్ నేర్తురుగాదె శైశవము పోనైయున్న కాలంబునన్.

రావ— ఇదిగో! నాహృదయతాపముం బాపుమందు! ఈలతాంగి నిరువదికన్నులతోఁ గూడనొక్కసారి చూచెద. (చిరకాలమామెవంకకుంజూచి కన్నులనుద్దేశించి)

సీ. కటికిచీకటివంటి కబరికాభారంబుఁ దఱపివెన్నెలవంటి చిఱుతనగవు
నతివిశాలాకారమైన కన్నుందోయిఁ గడుఁగుటిలములైన కన్నుబొమలుఁ
బురిగదించినపాశములఁ బోలువీనులు నరచందురుఁడుఁబోని యలికతలముఁ
గరఁగించినట్టి బంగరుఁబోలుకంఠమ్ము సాచీకృతంబు వక్షస్థలంబు

గీ. జక్కవకవను బుకఁటించు చన్నుదోయిఁ
గొండచఱివంటి జఘనపుమండలంబుఁ
గవకవలుగాఁగ మిగులు నైక్యంబు గల్గి
కనుఁగొనుం డాసదీఱఁగఁ గన్నులార!

(ఆకసమువంకకుం జూచి సీతను దలంచుకొని)

సీ. నల్లగల్వలసొరు నశియించి పోఁగాక గుబ్బుఁజూపులు చిమ్ము కోమలాంగి
పగడంబునకు వెల్లఁబాటు చేకుఱుఁగాక గెమ్మోవి ప్రకటించు మెమ్మెలాఁడి
బంగారమున కున్నవన్నెతగ్గునుగాక మైలీల వెలిపుచ్చు మోలతాంగి
వింటఁ జందిృయుగంబు విభ్రాజిలునుగాక మొగము పైకెత్తు మో ముద్దుగుమ్మ

గీ. పంచదారకుఁ జేఁదు చొప్పడునుగాక
గొనబుమాటల నించు మోవనజగంధి
రామణీయకశాలి యీరావణుండు
మనవి గావించుకొనుమాట వినుము తరుణి,

ప్రతీ— ఆహా! సహజసౌందర్యవతుల సహాయ్యకంబునం దుంటవిలుకాఁడీబొజుంగు రాయల నెంతగా నెల్లిదము చేయుచున్నాఁడో?

సీ. మధురంబుగ నొకండుమాటాడునొక్కఁడుసొగియింపఁగాఁజూచునగునొకండు
నునుఁదమ్మిఁ గేలఁద్రిప్పు నొకండు మెడలోరహించుహారంబులాడించునొక్కఁ
డంగభంగము లీల నాచరించు నొకండు చేత గల్లంబు స్పృశించు నొకఁడు
లలితసంగీత మాలాపించు నొక్కఁడు మించుఁబూదండలెక్కించు నొకఁడు.

గీ. చిట్టమిడుచు నొకండు కెంజేతినడుమఁ
దలఁ గదల్చుచు నొకఁడు వర్ధిలెడుకోర్కి
కనుగుణంబుగ నిరుగేల నభినయించుఁ
గాముకుల నేమిచేయఁగఁ గారు చెలులు.

(కొంచెము బిగ్గరగా)

గీ. రాజులందఱు వినుఁడయ్య రావణుండు
విరువఁజాలని ముక్కంటివిల్లు విఱుచు
టోలిగాఁగ విదేహభూపాలు మెప్పు
వడయువానికళత్రి మీపుడనికాన్పు.

రావ— (క్రోధహాసములతో) ఓరీ ! మూర్ఖ ! కైలాసాద్రి నిట్టట్టుఁ గదల్చినదశకంఠుని చేతులకటరా, ముక్కంటివిల్లు విఱువఁజాలనివను నప్రతిష్ఠ !
అయినను—

మ. రజతాద్రింగదలించు టాత్మదశమూర్ధచ్ఛేదనం బచ్యుతా
గ్రిజుఁ గారాగృహబద్ధుఁజేయుట మొదల్గాఁ బెక్కుకార్యంబులన్
భుజశక్తిం బొనరించినట్టిదశకంఠుం దేవయానాపహా
రు జన్నం బెన్నునె పార్వతివిల్లొకటి యారోపించినన్ ద్రుంచినన్.

హేమ— చెలీ ! జానకి ! రాజు లందఱును హరశరాసనం బెక్కిడుట కారంభించు చున్నారు. నీసౌందర్యమును నిర్మించిన విధాతపరిశ్రమంబు సఫలంబగుఁగాక. తుంటవిలుకాని ధనుర్విద్యాపరిశ్రమంబుగూడ సఫలంబగుఁగాక.

ప్రతీ— (తనలో) ఓహో ! ముందుగా నరకాసురుఁడే ధనుర్భంగంబునకు సన్నద్ధుం డగుచున్నాఁడె (ప్రకాశముగా)

మ. అమరస్త్రీలు సుగంధిగంధహరణవ్యాలోలకృష్ణాగరు
ద్రుమమూలంబులఁ బాడుచుం దెర్వనికీర్తుల్ నాఁడు భూమీకళ
త్రమునం దాదికిటీంద్రి మెవ్వని గనెం బ్రాగ్జ్యోతిషాధీశ్వర
త్వముఁ గైకొన్నతఁ డెవ్వఁ డానరకుఁ డీతండే సుమీ జానకీ.

హేమ— చెలీ ! జితఖంజరీటంబులును దులితబాలతమాలంబులు నగు క్రీగంటి చూపులఁ జూడుము.

సీత— సురవిరోధి యసురుఁడే కాఁడు?

హేమ— చెలీ! విచారింపకుము! శంకరశరాసనము రక్కసు లెక్కిడ దగినది కాదులే.

ప్రతీ— ఏమీ! ముక్కంటివింటి దిట్టతనము! జగజెట్టియగు నరకుండును—

క. ముక్కంటిచాప మిదియని వెక్కసముం బడుచుఁ బోయి విఱుచుటయును న
మ్మెక్కిడుటయు నటులుండఁగ జిక్కికిఁ జనలేక మరలి చతికిలఁబడియెన్.

రావ— ఛీ ఛీ వసుంధరాకుమార! ఇసీ! నీయభిమానము కాల్పనా! ఆరంభించిన కార్యము సమాప్తి నొందింపకపోవుట యపయశస్సు కాదా.

వ్రహ— అందఱును రావణాసుర లగుదురా యేమి!

ప్రతీ— (మఱియొక వంకకుఁజూచి తనలో) ఇదిగో! ఇఁకఁ బాండ్యరాజుగారు బయలు దేఱినారు (ప్రకాశముగా)

ఉ. గంధపుఁగొండ నెత్తముల గంధపుమోకల నుండుసర్పపుం
జందనగంధు లందఱకు సారెకు బోయెత లేగి విన్నవిం
పం దమతేని నిండుసభ వారు యదీయయశంబు నెంతు రా
నందమయాత్ముఁ డాధరణినాథుఁడు పాండ్యుఁ డితండు వచ్చెడున్.

సీ. ఎవనిపుట్టువుకల్మి నెపకంబు నపమును నధిగమించె మదన్వదన్వయంబు
వేల్పుటావుంబోలి వెలలేసముత్యాలధన మెవ్వనికొసంగుఁ దామ్రపర్ణి
యెవనిపో రప్సరోయువతీమణులకెల్లఁ గొ్రంగొ్రత్తమగలను గూర్చుజాణ
యందకత్తెలకెల్ల నరుసుపుట్టించు దివ్యౌషధి యెవ్వాని యొడలిసొంపు

గీ. హస్తచేయంబు లెవ్వానియశము లతఁడు
పాండ్యభూపాలకుఁడు నుతింపందగండె
ధనము సర్వము నిచ్చుచోఁ దనకుఁ బాత్ర
తయు నపాత్రతయును లేనిదాత గాని.

హేమ— కపోలకాంతిజితముగ్ధమధూకకుసుమచ్ఛవీ! నెచ్చెలీ! యితఁడు పాండీఁడు. తుమ్మెదబారులఁ దూలించుకటాక్షంబు లితని మోమునమ్మిపైఁ జిమ్ముము.

సీత— ద్రవిడచూడామణీ గదా!

ప్రతీ— (ఎవరికిని దెలియకుండ నవ్వి)

గీ. విఱుచువానివిధంబున వేగఁబోయి
చేతఁజేకొని యల్లంత సిగ్గువడుచు
మస్తకము వంచి విల్లు నమస్కరించి
వీడుచున్నాఁడు పాండ్యపృథ్వీవరుండు.

రావ— (నవ్వి) ఆహా! యీపాండీఁడు విఱువలేక విడుచుటకు మఱియొక కారణమును సూచించుచున్నాఁడే! ఏమీ! చాకచక్యము!

ప్రతీ— (మఱియొకవంకకుఁజూచి) ఇతఁడు మాహిష్మతీనాథుండగు శత్రుంతపుఁడు (ప్రకాశముగా)

ఉ. హైహయవంశ మొప్పుఁగద యత్రివిలోచనశుక్తిమౌక్తికం
బౌహిమరశ్మి వంశకరుఁడై తగ; నందు జనించె నర్మదన్
బాహుల నాచిపట్టె తలవంపులొనర్చెఁ బులస్త్యసూతికిన్
వాహవ! యర్జునాహ్వయుఁడు వాని కుమారుఁ డితండు వచ్చెడున్.

చ. కరమను మానికన్ వకుళకంబులతావులు కొల్చునట్టినే
ర్పరియును దంపతిప్రణయభంగులపొంగుల లెక్కవెట్టు నే
ర్పరియును బండువెన్నెలఁ గరంబులఁ బుక్కిటఁబట్టితాగు నే
ర్పరియు గణింపఁజాలును సరాసరి నీతనికీర్తిసంపదల్.

హేమ— చెలీ! యీతఁడు దశార్ణదేశాధిపతి. ఇతనిఁ దిర్యగ్దర్శననిలీనకాలిమంబు లును దులితచంద్రఖండపాండిమంబులు నగుకటాక్షంబుల వీక్షింపుము.

సీత— దశార్ణదేశ మనఁగా నర్మదప్రవహించినదేశమేకాదు?

ప్రతీ— క. మాని సుమా యీతండీశానుధనువుమీఁద దృష్టిసారించియుఁ దో
ద్రోనిమురుకొనెఁగా నిభృతంబౌనటు తనభుజవిజృంభితానత ముఖమున్

ప్రతీ— (మఱియొక్క ప్రక్కకుఁ జూచి తనలో) ఇదెసింహశేంద్రమహారాజు వచ్చు మన్నాఁడు (ప్రకాశముగా)

క. వననిధియు రోహణాద్రియు ధనగృహములు వచనములు మదనమంత్రము ల
య్యనుకోధనగరి కాఁపుర మినసముఁ డగుసింహశేంద్రుఁ డీతండవురా!

చ. ఎవని కరాసి శత్రుధరణీంద్రశిరంబులు గోయ నప్పరో
యువతులతో క్షణంబునకె యుప్పరమందుఁ జెలంగువార ల
వ్వ్యవనిని గూలకుండ నడయాడెదు నాత్మకబంధరాశిపైఁ
బువుజడి నొల్కుచుం ద్రితఁడెపో యితఁ డద్భుతదోర్బలుం డనిశా.

హేమ— అనమగ్రయౌవనారంభ యగువైదేహీ! క్షణవికచకమలచ్ఛవికరంబితంబు లగువిలోచనాంచలంబుల నాలోకింపు మితండు రోహణగిరిపరమేశ్వరుండు.

సీత— కౌస్తుభవంశజాతంబు లగురత్నంబులఁ దలఁ దాల్చువాఁడే కాఁడు?

ప్రతీ— (తనలో) ఇతఁడు మందబుద్ధివలె నున్నాఁడే! ఏపనికిని మనంబుఁ జొరపీ కున్నాఁడు.

గీ. చండికానాథు మేటికోదండమందుఁ
దనభుజాదండమందును దారుమారు
గాఁగ నూరేసిసార్లు గతాగతంబు
లాచరించుచున్నవి వీనిలోచనములు.

లావ— సింహశేంద్రా! ఏమి సందియపడెదవు? సంశయగ్రస్తులెన్నండును వీర వ్రతంబు నిర్వహింపఁ జాలరు.

ప్రతీ— (ఒకప్రక్కకుంజూచి తనలో) ఇతఁడే మధురాపురమహారాజు బయలు దేఱినాఁడు.

గీ. కంసముఖులైన దుష్టరాక్షసుల నెల్ల
జన్మ మెచ్చట వహియించి శార్ఙ్గపాణి
మాపఁగలఁడంచుఁ దొల్లిటిమౌనివరులు
వ్రాసి రప్పేడు మధురకు రాజితండు.

చ. కలనులపైన మాఁగఁ బువుకల్మల నీపములూఁగ నెమ్మి కే
కలు చెలరేఁగ లేమొగులు కన్నులకుం దివిఁదోఁచినంతనే
కిలకలలాఁడుచుం ద్రుటితకంచుకబంధములైన సంబరం
బులఁ దిలకింతు రీతని రిపుప్రమదల్ చెలికాండ్రకాంతలున్.

హేమ— నిసర్గసర్వాంగసుందరీ! జానకీ! ఇతఁడు మధురాపురమహారాజు.
చక్కఁదనముఁ జూడఁ దలంచినచో నితనినే చూడవలయుఁ జుమీ.

సీత— బృందావనవిహారదుర్లలితుఁడే కాఁడు?

ప్రతీ— అధిగతకోదండపాండిత్యుఁడయ్యు నీతఁడూరకున్నాఁడేమి?

గీ. శశధరునిచాప మెక్కిడఁజాలుఁ గాక
చాలకయపోవుఁగాక యీనేల తేని
బుజములందలి జ్యాకిణంబుల పసందు
తెలుపుచున్నది విల్కాఁడిదీమసంబు.

రావ— మహాధన్వియయ్యు మధురాధిపతియీశ్వరచాపారోపణమున నేల
యోజకుఁడయ్యెను!

ప్రతీ— (మఱియొకవంకకుం జూచి తనలో) అవంతీరాజగు సత్యవ్రతుండు
చున్నాఁడు (ప్రకాశముగా)

చ. శమితమనస్కుఁడైన పురశాసనుఁడుం బహువిభ్రమోపదే
శి మరుఁడు వైరముల్ వదలి శీప్రయనంజనునే అగ్రత్తగాఁ
గ మనము నించు నేనగరి కాఁపుర ముండిరి యిర్వు రేకపీ
ఠము ఘటియించి దానిఁ బ్రకటక్రముఁడీతఁడు ప్రోచుచుండెడున్.

సీ. వీరలక్ష్మికిఁ గొ్రత్తవేణికాబంధంబు భుజపణాధర రాజమునకుఁ బడగ
ప్రేతాధినాథచమూతటినికి వీచి పొగరుఁబోతులకుసుభ్రూపతాక
యమరకాంతాకటాక్షములకు సంకెల గడితంపుసిరికిఁ గీ్రఁగంటిచూపు
సరికామినీతతి కస్రప్రవాహంబు తొలఁకుకోపాగ్నికి ధూమవర్తి

గీ. యగుచు నెవ్వనితరవారి పగఱ నన్ని
సమరములయందు నోడించి జయముగాంచు

నతని నుతియింపఁ దరమె సమస్తనృపతి
వందితశ్రీసనాథు నవంతినాథు.

హేమ— చెలీ ! యితఁడు విశాలాపురీనాథుఁ, డితనియెడ నీ కటాక్షపాండిత్యమును దేటపఱచుము.

సీత— మహాకాళుఁ డనునామముగల యీశ్వరుఁ డున్న పట్టణమునకు రాజేకాఁడు?

ప్రతీ— (తనలో) విల్లెక్కిడకయే యూరకున్నాఁ డేమో ? (ప్రకాశముగా)

గీ. కంటిలోని తృతీయభాగమ్ముచేత
హరిశరాసనమును జూచి యంతమరలి
యవలిమో మయి చెలికానియందు దృష్టి
పఱపి మాటాడుచున్నాఁ డవంతిరాజు.

రావ— ఓయీ ! అవంతినాథ ! పురాతనశీర్ణశంకరశరాసనారోపణంబునకుఁ గూడ నాలోచించుచున్నావేమి ?

ప్రతీ— (మఱియొకవంకకుఁ జూచి తనలో) ఇతఁడె ! క్రథకైశికాధిపతి వచ్చుచున్నాఁడు (ప్రకాశముగా)

గీ. సరసమగుకైత కేపీడు జన్మభూమి
యేపురము తుంటవిలుకాని కాఁపురంబు
రాజమార్గచరద్రమణీజనంబు
కుండినం బది యేలు నితండు సీత,

ఉ. రూపసి జాణ వేత్త చతురుండు మనోహరుఁ డిక్షుధన్వకుం
గా పపవర్గి యీనృపశిఖామణి పేర్విని శత్రువుల్ మృతిం
జేపడుటఁ సురత్వమును జెందర దాన సురాంగనల్ వృథా
రూపులు దిద్దుటయ్యెనఁట కొ్రత్తవరుల్ లభియింపకుండుటన్.

హేమ— స్నిగ్ధశ్యామలకుటిలకుంతళా ! జానకి ! యితండు కుంతలేశ్వరుం డితనిం జూచి చేరలఁగొల్వం దగునీనేత్రనిర్మాణమును సార్థకమును జేసికొనుము.

సీత— మహారాష్ట్రచూడామణియే కాఁడు ?

ప్రతీ— (తనలో) ఇతనిచరిత్ర ప్రకృతిపరాధీన మనితోఁచుచున్నది (ప్రకాశముగా)

గీ. లెండు పిల్లెక్కిడుండని లెంక లంద
జేపుకల్పించి తన్ను బ్రేరేపుచుండఁ
దనదురూపంబుతోడ శస్త్రప్రభావ
మెన్నుకొనుచుండె నీకుంతళేశ్వరుండు.

రావ— ఈతఁడు బాలఁ బిల్లతనపుఁజేష్ట చేసినాఁడుసుమీ!

ప్రతీ— (మఱియొక వంకకుం జూచి తనలో) ఇదిగోఁ గాంచీపురపరమేశ్వరుఁడు వచ్చుచున్నాఁడు (ప్రకాశముగా) ఓ విదేహరాజనందనీ! యిటుఁజూడుము.

ఆ. కంతువైరి చిచ్చుకంట జన్మించిన
కొలమువాఁ డితండు కొమరుఁ డితని
కీర్తు లఖిలభువనకీర్తనీయంబులు
కాఁపురంబు కాంచికాపురంబు.

మ. పగగొంచుం బలవంతు నీతని ననిం బాటింప కత్యద్భుతం
బుగఁ బోరన్ సురలంద తెవ్వరిపయిం బూలొల్కిరో వారిలో
విగతాసుత్వముఁజెందువారు సురలై వింటం బ్రవేశించి యిం
పుగ శేషించినవారి ముంతురు యథాపూర్వంబుగాఁ బూవులన్.

హేమ— నవకాంచనకాంచీదామాలంకృతకాంచీమండలయగు జానకీ! ఇతండు కాంచీపురీపరమేశ్వరుం, డితనివదనచంద్రికల భవన్నయనచకోరంబు లానుఁగాక.

సీత— చంద్రశేఖరవరప్రసాదీకృతమును కులక్రమాగతమునగు వృషభలాంఛనము గలవాఁడే కాఁడు?

ప్రతీ— (తనలో) ఇంద్రాణీశాపమును లెక్కచేయనట్లున్నాఁడే (ప్రకాశముగా)

ఆ. వె. హరునివిల్లు విఱువ కట్టిట్టుగదలక
యీతఁడూరకుండెనేమి యిట్లు
ఉదయదరుణరుచుల నొప్పారుచూపులఁ
గనలి లాఁతినృపులు కాంచుచుండ.

రావ— ఓరీ! మర్యాదహీనుఁడా! విల్లువిఱువకపోయిన నీవు కాంచీపురాధీశ్వరుండవు కావు. (అని యాలోచించి సిగ్గుతో) అగుదువు, ఇదిగో! ఉంటివిగదా!

ప్రహ— (నవ్వి)

చ. అవనికుమారి పెండ్లికత యందును గొంటుగతిం జరించు నీ
యవనిపతిం జలత్పులకితాంగుని జూచి దశాననుండు కో
పవశముఁజెందియుం దననెపంబునఁ జూపఱకెల్ల లోచనో
త్సవము శమించునేమొ యని శాంతముదాఁలిచి యుండె నెంతయున్.

ప్రతీ— (తనలో) శృంగారవీరరసలంపటుం డగులాటేశ్వరుఁడు వచ్చుచున్నాఁడు. (ప్రకాశముగా)

ఆ. వే. జగమునే స్తకాఁడు జలజాతభవుఁడు మున్
సంచెవార్చునాఁడు జలముఁ జులుక
ముగనొనర్ప నందుఁ బొడమెఁ జులుక్యుఁ డా
తనికులంబువాఁ డితఁడు కుమారి.

ఉ. వేరముఁ బూనినట్టి బృథివీపతులం దుర్విటిలోన గెల్చి య
వ్వారలయిండ్లకేగ వెలభామలు మౌక్తికకంధరాచల
ద్వారలు చూతు రీతనిముదంబున నంచులయందు షట్పద
శ్రీరహిమించు లేమొగలితేకుల తేకుమడంచు చూపులన్,

హేమ— అష్టమీచంద్రసదృశలలాట యగు జానకీ! ఇతండు లాటేశ్వరుండు శ్యామలధవళంబు లగుకటాక్షంబుల నీతని నిరీక్షింపుము.

సీత— అనుదినముఁ దన్నలంకరించుటతోనే కాలము గడపువాఁడే కాఁడు ?

ప్రతీ— ఇతఁడు సహజముగా మాయావి (ప్రకాశముగా)

గీ. చాపపుంద్రిప్పు దుడిచెదురూపుదోఁపఁ
జేయిసారించునే కాని చేతఁబట్టి
వింటి నెత్తను నెత్తఁడు తొంటిచోటు
చేరనైననురాఁడేమి చిత్రమితఁడు.

రావ— నిజము. వీఁడు శృంగారలంపటుఁడే కాని వీరపదమునకుఁ దగఁడు.

ప్రతీ— (తనలో) ఇదిగో! కుశస్థలీనాథుఁడు వచ్చుచున్నాఁడు. (ప్రకాశముగా)

సీ. నాటించె నెవఁడు సేనానీముఖంబుగా నసపుఁగంబములు దిగంతరములఁ
కావించెనెవ్వండు కరుణతో ధూతామయంబైన వైద్యశాస్త్రమృతంబుఁ
ఎవనివంశమునకుద్భవము బాపఁడు కాకమున్న విశ్వామిత్రమునివరుండు
వహియించె నెవ్వఁ డాబాలగోపాలంబుఁ దెలియ సుభ్రతుఁడను కలికిపేరు

గీ. చేసె నెవ్వఁడు మేటిదక్షిణలతోడ
రాజసూయాదికక్రతురాజములను
సకలరాజన్యవినుతప్రశస్తియితఁడు
సల్లలితుఁడు కుశస్థలీవల్లభుండు.

చ. గురిజపుఁబేర్లు నేరెటిచిగుళ్ళను గప్పినయప్పిఱుందు లం
బరముచెఱంగునందు ముడువంబడు జేగుఱురాలు నౌదలన్
దుఱిమిన నెమ్మిపింఛములునుం గలవేసము నొక్కయింతలోఁ
గఱుతురు కాన నేతదరికాంతులు చెంతలఁ నేర్పుఁజెంచెతల్

హేమ— ముష్టిగ్రాహ్యమధ్యయగు వైదేహీ! ఇతఁడు మధ్యదేశనరేంద్రుఁ డితని గుతూహలవికసితనయనజలజవై చూడుము.

సీత— ఇతఁడేనా! మందరాద్రిచేతం దఱువంబడిన పాల్కడలియందుం బొడమిన ధన్వంతరికిఁ జరమావతారం బగుదివోదాసుని ప్రథమశిష్యుఁడగు సుశ్రుతుఁడు.

ప్రతీ— క. ఎడమకరంబున విల్లొని కుడికేలం ద్రాడు లాగికోఁజాలక వి ల్విడనాడఁడు వంపం డీతఁడు పదుగురు రేఁడ్లుచూచి తనునవ్వంగన్.

రావ— ఓహో, కుశస్థలీనాథ! నీవాయుర్వేదమున సుశ్రుతుఁడవైనను ధనుర్వేద మున కుశ్రుతుండవే. అన్నిరోగములకుం దగినయౌషధ మెఱుంగుదువు గాని హరచాపారోపణమునకుం దగినయౌషధ మెఱుంగవు.

ప్రతి— (తనలో) వీరే! రాజు లనేకులు హరధనురారోపణంబునకై గుంపుగుంపు లుగఁ దయచేయుచున్నారు (ప్రకాశముగా)

సీ. చండాసిరశ్మి యోధుండీతఁ డీతఁడే మగధభూమీభర్త మాన్యయశుఁడు
కాంభోజవిభుఁడు విఖ్యాతాన్వయుండీతఁ డీతఁడే సౌరాష్ట్రభూతలపతి
సకలకలావేత్త శకనృపాలకుఁడీతఁ డీతఁడే నేపాలనృపవరేణ్యుఁ
డఖిలభోగాన్వితుం డంధ్రేశ్వరుం డీతఁ డీతఁడే కర్ణాటనృపవరుండు

గీ. ఇల్లిదే యెల్లభూపాలు రేగుఁదెంచి,
రిందుమౌళిధనుస్సుపై, నిందువదన
గోముపైఁ. గుతూహలమును, బ్రేమభరము
మెండుకొనఁగా రసస్ఫూర్తి నిండుకొఁనగ

హేమ— హారలతాలంకృత ఘనస్తనీ! ఘనస్తనితప్రచండగంభీరభీషణభాషణులును, సకలమహీమండలమండనైకపరాక్రములునగు మహీపతులు వీరుగో! వచ్చు చున్నారు. నిండుఁదమ్మిఱేకుదొప్పలంబోనితెలిగన్నులు విప్పారవీరిఁబరికింపుము

సీతా— ఏలాకో యీనఁపాలురు సకలక్షత్రియమానఖండన మగు ఖండపరశు చాపా రోపణమున బింకములు వెలార్చుచున్నారు!

క. ఏకాగ్ర మైనమనమున నీకార్ముక మర్చనీయమే యెల్లరకుం
గాక మఱేమనుచు నమోవాకంబులఁ గేలుమోడ్చువా రదె వారల్!

క. కొందఱు రాజులు చేతులయందుం బురహరునిచాప మాఁపమి నట వా
రందఱు నవ్వఁగ నిలపైముందఱ బోరగిలఁబడఁగఁబోయిరి కట్టా.

రావ— ఓహో! వీ రందఱును నొక పురహరుచాపమే యారోపింపఁజాలకపోలేదు. తమపేరులఁగూడ ప్రవీరులలెక్కలో నారోపింపఁజాలకపోయినారు.

ప్రతీ— ఈక్షత్రియు లందఱును క్షత్రియులు చేయందగినచాపారోపణరూపకార్యంబున నోపమిఁజూపుచున్నారేమి? ఇఁక నిందు వికర్తనకులకుమారుండగు రాముఁడు మాత్రము మిగిలియున్నాఁడు (పెదవులు విఱిచికొని) ఈకుఱ్ఱఁడు మాత్రమేమి చేయఁగలఁడు.

ఆ. వె. దేనిరజము రాల్పఁ దివిరి లోహపుసూది
వాఁడిమొనలకేని గోడుచెడునొ
యట్టివజ్రమునకు నక్కటా బోటుల
గోటిగీటు లెంతపాటి తలఁప.

(ఆలోచించి) అయినను నితనిఁ గొనియాడెదను. వీరులసారంబు గుర్తింపఁదరము కాదు. అందులో విశేషించి సూర్యవంశపురాజుల పరాక్రమంబులు బొత్తిగాఁ దెలియవు.

రావ— లంకాధిపతినగు నే నీచాప మలక్ష్యభావముచేత విఱువమానితి; నీరాజులందఱును విఱువనసమర్థులైరి వృషధ్వజాయితము విజృంభించినదన్నమాట సుమా! (చాపమునుద్దేశించి) ఓపాఁతవెదురుబద్దా! హరశరాసనమా!

గీ. నాఁడువిఱువక దిగద్రావినాఁడటంచు
దృఢిమ గర్వంబు మానుము, తాఁదలఁచినఁ
జిమ్రిపుగఁ జేయఁజాలు ముంజేతిలావు
గల్గువాఁడు సుమీ దశకంఠుఁ డనఁగ. (లేవనున్నాఁడు)

ప్రహ— దేవా! ఇది హరకార్ముకము గాదు. ఈమె సీతయునుగాదు.
రావ— ఏమిటి?
ప్రహ— నాటకము.

ప్రతీ- ఆ. వె. నీరు పుట్టినిల్లు నిశ లగ్నిహోత్రంబు
తనువునందు రుచులు దాఁచువాఁడు
చదలితొడవు నిశలఁ జందమామ వెలుఁగు
నైన సూర్యునకు జోహారు సేతు.

అట్టివికర్తన కులంబునందు మను వుదయించె; నామనువు వంశంబునం దుదయించినవా రనేకులు గల రందు,

క. అంగజులవలన సాగరముం గావింపించె సగరభూపాలుఁడు ద్యో
గంగం దెచ్చి యవనిపూతంగావించెను భగీరథక్ష్మాపతియున్.

క. వారికులంబునఁ గలిగినవారల నధికుండు భరతవంశీయసదా
చారుండు వీరుఁడుం బదితేరులదొర యాజి యాజిధీరుం డలరెన్.

చ. ఎగుభుజముల్ విశాలలలితేక్షణముల్ గలయందగాఁడు, మె
ప్పుగనినవాఁడు సద్గుణసమూహముచేత నయోధ్యలో, ధను
ర్నిగమము గాధిసంభవుఁడు నేర్పిన నేర్చినవాఁడు, రాముఁడన్
సొగసగుపేరుదాలిచిన భూపఁ డితం డిదె యేఁగుదెంచెడున్.

రామ— తమ్ముఁడా! లక్ష్మణ! ఏమిది. ఇతఁడు నాపేరెత్తుచున్నాఁడు? (అనిలేచుచున్నాడు)

లక్ష్మ— ఇదిగో! నేను లేచుచున్నాఁడను. (లేచి ఇరువురును మంచముదిగిరి)

వశిష్ఠ— బాగు! రామభద్ర! బాగు! నిజముగా సూర్యకులాలంకారాంకూరమ వని పించుకొంటివి.

రావ— ఓరీ! క్షత్రియపోత! అభిమాన మనిన నీకే కలదురా! అధ్యవసాయమన్న నీవే యెఱుఁగుదువురా! మనుష్యస్త్రీలయందు నీతల్లియె పుత్రవతి!

జనక— విశ్వామిత్రుఁడు దిలీపదశరథుల నతిక్రమింపఁగల పనిచేయఁబూనినవాఁడు!

హేమ— రామచంద్రునకు వయసుననే చిన్నతనము. నడవడి నన్ననో అఖిల రాజ మండలమున కంటెఁబెద్దఱికమున్నది.

శతా— ఓసూర్యశిష్యాంతేవాసీ! యీబాలుఁ డతిసాహసివలె నున్నాఁడు! ఏలన;—

క. చాపం బీశ్వరుని దనియు, భూపాలురు విఱువలేకపోయిరనియు నీ
పాపఁడు లెక్కింపఁడు బలె! బాపురె! సూర్యాన్వయంబు పాటికినెక్కెన్.

వశిష్ఠ— క. కంపముఁ గనఁబో కాదిమదంపతుల కెఱింగి విఱువఁ దలపెట్టెను బల్
తెంపు గలిగి యింపగునో కంపగునో బుడుతవాని కర్మంబు కటా.

హేమ— భగవంతుఁడు దాక్షాయణీవల్లభుఁ డేమిచేసెనో అదియే చేయఁగలఁడు! సింగంపుఁగొదమలవంటి ముంజేతులుగల యీబాలురకు భుజదండమండనీయ మగుకార్యంబున దుష్కరత యెట్లుండును!

రామ— (చాపంబునకు నమస్కరించి)

క. పురములు పూర్వము కాలిచి సురసారమయంబ వైతిమూ; వై దేహీ
వరకారణమైతిప్పుడో హరచాపమ! నీకు నే జోహా రొనరింతున్.

(వేగముగాఁ గోదండముఁ గేలం గొని లక్ష్మణు నుద్దేశించి)

గీ. వత్స! లక్ష్మణా! తగఁ గనువైచికాంచు
చుండుమా మద్భుజాకాండయుగ్మ మార్భ

టింప హరచాపమదియె పటేలుమనునొ
ఎక్కిడఁగరాక త్రాడెె పుటుక్కుమనునొ.

రావ— ఇదిగదా యాటగాండ్రియార్భాటము!

లక్ష్మ— ఆర్యవర్యా! హరకరాకర్షణంబు సైతము సహించిన యీవిల్లు విఱుగుట సంభావ్యముకాదుసుమా!

రామ— అయిన నిదిగో! ఎక్కువెట్టుచున్నాను.

రావ— ఇదియును నటవిభీషికయే.

ప్రతీ— (అంతటఁజూచి)

గీ. చాపకోటికై యెంతెంత సాగుచుండె
నారి రామానుబంధమ్మనను గ్రహముగ
నంతకంతకు సర్వనరాధిపులయు
వెదమొగమ్ములు వెస నల్లఁబడుచునుండె॥

లక్ష్మ— ఈరాజు లందఱకును గేవలము మొగంబులు నల్లఁబడుటయే గాదు.

మ. నగుచుం దుర్నిరిముందు తేండ్లు సగమున్ జాపంబుఁ బై కెత్తనెం
చఁగ, నారిం బిరిగొల్పి లాగఁ దలఁపం జప్పట్లు వాయించి, రిం
పుగ నారిం గొనఁ గూర్చఁబోవఁగ మొగంబుల్ వాల్చి రాకర్షితం
బుగఁజేయం దమ యున్నగద్దియలపై మూర్ఛిల్లి రెంతేనియున్.

ప్రతీ— (హఠాత్తుగాఁ జూచి) ఆకర్షితంబే కాదు విఱిగిపోయినది. (బిగ్గరగా)

మ. మును పెన్నండును నేరిచేతను బరాభూతంబు గాకున్న భ
ర్గుని యీవి ల్విఱిగెక్ రఘుప్రవరుఁ డారోపింప రాజన్యనా
శనదీక్షాచరణప్రచారునకు క్రౌంచక్ష్మాధరద్వేషిక్
ధనురామ్నాయనిబోధనప్రవణమన్నా! యెంతయాశ్చర్యమో!

రావ— ఇదియును గల్లనుగూడ నిజ మనిపించు కవివచనరచనయే.

విశ్వా— సఖా! సీరధ్వజ! రామచంద్రునియందలి మాధనుర్వేదము నేఁటికిఫలించినది.

శా. చేతోరాముఁడు రాముఁ డీహరధనుశ్శింజాచ్యుతిం జేయఁ ద
జ్జాతారావము మ్రోగెఁ వేలుపు లవిశ్వస్తభ్రమోపేతులై
కాతర్యంబు వహింప దిక్కరిఘటాగండస్థలం బెండఁగాఁ
బాతాళంబులు నేడు భీతిఁ జలియింపన్ దిక్కు లేకంబుగన్.

శతా— ఏమివింత! ఏమివింత! రామచంద్రునిచరిత్రము ముక్కంటికన్న మిన్నగా నున్నదే

సీ. జగము లన్నియుఁ బ్రోవఁ జదివినతొలిపల్కుకళ కావెఁబఱ్కునోంకారమనఁగ
బగఱ దెందంబులు వగుల నార్చిన యమునాసోదరుని బిట్టున వ్వనంగఁ

లజ్జపెంపున నొదలలు వంచు తేండ్లకీర్తి బాజాదోలు భేరిరవ మనఁగఁ
దనకీర్తిమహిమ కెంతయుఁ బొగడయొనర్చు వందిమాగధుల కైవార మనఁగ

గీ. దవరు టంకారమునన రోదఃకటాహ
మదురివ మునక్కంటివిపంబుఁ జిమ్రిపలుగ నొ
నర్చినట్టి వికర్త నాన్వయకుమారుఁ
దనుఁగుఁబెండిలికొడుకయ్యె జనక! నీకు.

జన— భగవంతుండగు నీలలోహితునియనుగ్రహము.

గీ. ఏనరేశ్వరులును జేయలేని గొప్ప
పనియొనర్చిన పనివాఁడు మనకనుంగు.
పెండ్లికొడుకంచు మోదంబుఁ విఱిగిపోయె
నభవువిల్లని మఱియుఁ బెల్లడరు దోఁచె.

సీత— సఖియా! హేమప్రభా! హరదేవధనుర్భంగము జరగెను గదా.

హేమ— అంతేకాదు. మాసఖురాలికిఁ బరిణయముఁ గూడ జరగనై యున్నది.

రావ— (పెద్దనవ్వి) ప్రజ్ఞావంతులచూపు గొప్పమనసుగలవారి తెలివితేటలమీఁద బాఱుచుండును.

ఉ. తా నొకపెద్దగాఁ దెలివితక్కువవాఁడగురాముఁ డీమహే
శానుని ప్రాఁతవింటిని బిసప్రతిమానముఁ ద్రుంచినంతమా
త్రాన ముజ్జగంబుల బరాబరి కీర్తుల నోఁకు టేనికిన్
మానికి నిర్జితాగ్రజవిమానికి మానము తగ్గిపోవునే.

రామ— (గద్గదస్వరముతో)

శా. ఆరోపించితి శైవచాపలత విశ్వామిత్రువాక్యంబునం
దోరాస్ఫాలన సేఁప కయ్యదియు మంతుందెచ్చె రెండౌచు; ల
జ్జారూక్షవనుఁడయ్యె దాన జనకక్ష్మాభర్త; యే ముత్తరం
బారంభించునొకో క్షమాపణకునై యద్దేవుతో నిత్తఱిన్?

లక్ష్మ— లోకంబునం బౌరుషంబులకుఁజాల భేదము గలదు.

ఆ. హరునికార్ముకంబు విఱుచుటఁ గని మాదృశులకునెల్ల మేను పులకరింప
గద్గదస్వరంబుగాఁ జూపు నాసాగ్రమందు నిలిపి యార్యుఁ డుందుఁగుందు.

విశ్వా— శతానందా! దిలీపకులాలంకారంబగు దశరథునికుమారుఁడగు రాముఁడిట్టి పని యొనర్చె ననుట కిబ్బరమేమి!

శతా— మహారాజ! జనకచక్రవర్తీ! యిఁక ముందొనరింపఁదగిన కృత్యంబు లొనర్చి రామచంద్రునకు సీతను బెండ్లి చేయుము.

జన— (మంచము దిగి కొంత నడిచి)

క. ఖండితచండీశధను ర్దండభుజావండనిర్జితన్ మత్పుత్రిన్
బెండిలి గమ్మిఁక రాఘవ! యుండుంగా కింకఁగమలయుం గమలమునన్.

(అని రామభద్రునిచే సీతాపాణిగ్రహణము చేయించుచున్నాఁడు)

ప్రహ— (నవ్వి తనలో)

చ. నటజనకుండు నాటకమున న్నటమైథిలి రామమూర్తికిన్
నటున కొసంగఁగాఁ దలఁచినం గని సత్యమకా తలంచినం
తట నరుణమ్ములయ్యెఁ గనుఁదమ్ములుఁ గత్తులువూనెఁ జేతులున్
బటపటలాడె దంష్ట్రలును బండ్లును మాదశకంఠభర్తకున్.

(ప్రకాశముగా) రాక్షసపతీ! నాటకము సమాప్తికావచ్చుచున్నది. కావున నర్తకుల యభినయచాతుర్యమును రసవృద్ధియుఁ జక్కఁగఁ బరిశీలింపుము.

రావ— (సిగ్గుతోఁదనలో) ఇదినాటకమా! నిజమనుకొని వ్యర్థముగాఁ గోపపడితిని సఖా! ప్రహస్త! యేను మున్నొనరించినప్రతిజ్ఞ మఱచిపోలేదు గదా!

ప్రహ— మఱచి పోలేదు (అని మొదటియంకములోని "ధరణియు నింగియుం బగిలి" అనుపద్యము చదువుచున్నాఁడు.)

రావ— తప్పక యాపని చేయుదును.

(రెండవతెరలో వైతాళికుఁడుప్రవేశించి) మహారాజ! నీకు జయము నీకు జయము సాయంసంధ్య యల్లుఁడగురామభద్రునితోఁ గూడ దేవరకుసుఖప్రదమగుఁగాక

మ. ముకుళీభావము తమ్మిపూవుల కొగిం బోధించి యస్త్రాద్రిచెం
తకు మార్తాండుఁడు వోవుదెంచెఁ బరిశాంతంబై నసీతెండతో
నకవోష్ణంబులు నైన దీధితులమ్ముం దందందఁ జీఁకట్లు మే
చకనీరేజసనాళకుట్మలసమచ్ఛాయం బ్రవర్తిల్లఁగన్.

గీ. సంధ్యకును వాసరమునకు జరగుచున్న
పరిణయములోని హోమాగ్నిభాతిఁదనరె
భానుబింబంబు; లాజల భాతిఁ జెలఁగెఁ
దరళతరళంబులైనట్టి తారకలును.

(మరలఁదెరలో) దేవరా! దేవు లిట్లు విన్నవించుచున్నారు.

గీ. అంతిపురివాడు చనుదెంచి రతిశుభపవి
దము వివాహముహూర్తంబుఁ దానువచ్చెఁ
గూఁతుతోఁగూడఁ బెండిలికొడుకు రాముఁ
బరిణయపుదీక్షఁ గైకొనఁ బనుపు జనక.

జన— ఇదిగో! పంపుచున్నాను. నేనును బోవుచున్నాను. (అని ప్రతీహారి చెవిలో నేమేమో చెప్పుచున్నాఁడు.)

ప్రతీ— (కొంచెముబిగ్గరగా)

క. ఈపుణ్యసభకు వచ్చిన భూపాలకులారః జనకభూపాలుఁడు వి
జ్ఞాపింపుమనియె మత్పురగోపురములనుండి పూజ గొనవలె ననుచున్.

(అందఱును నిష్క్రమించుచున్నారు)

(ఇది సీతాస్వయంవర మనుపేరుగల గర్భాంకము.)

రావ— (ఆలోచించి)

ఉ. రాజులకొల్వునందు రఘురామునకున్ యశమబ్బలేమ భ
ర్గాజగవంబు భంగమును నందనులే దిదియెల్లఁ గల్ల గా
నీ జగజెట్టియైన రజనీచరనాథునియల్కకుం గటా
యాజికుమారుఁ డొక్కరుఁడ యగ్గలమాయెను వేయు నేటికిన్.

(సీతనుదలఁచుకొని) "చిఱునగవున్నచో"-అనిపఠించును)

ప్రతీహ— దేవా! దేవతానాటకము సమాప్తమాయెను గావున భరతాచార్యపుత్రుల కిఁక సెలవిమ్ము. దేవరయు నంతఃపురమునకు విచ్చేయుఁడు.

(అందఱును నిష్క్రమించుచున్నారు)

— గద్య —

ఇది.....శ్రీతిరుపతివేంకటేశ్వర విరచితంబగు నాంధ్రీకృత
బాలరామాయణ నాటకమున తృతీయాంకము



శ్రీమత్పరదేవతాయైనమః

# బాలరామాయణము

## చతుర్థాంకము

(పిదప నుపాధ్యాయుఁడును శిష్యుఁడును బ్రవేశించుచున్నారు)

శిష్య— ఓయుపాధ్యాయా! తమయొద్దఁ జదువుకొనుటకు వచ్చినవాఁడను నాపేరు భవభూతి సాష్టాంగపాతముగా నమస్కరించుచున్నాను.

ఉపా— విద్యావంతుఁడవు కమ్ము! నాయనా! భవభూతీ! నీ కుపనయనాదిసంస్కారము లాచరించినవా రెవరు? నీ వెటనుండి యిటకు వచ్చితివి?

శిష్య— భగవంతుం డగుపరశురాముఁడు. వారియాశ్రమమునుండియే వచ్చితిని.

ఉపా— భగవానుఁ డగుపరశురాముఁ డీశ్వరునివలన ధనుర్వేదమును జతుర్దశవిద్యలనుగూడ జదివినమహానుభావుఁడు గదా! అయ్యనఘుని వదలి మఱియొకని యొద్దఁ జదువుకొనుటకుఁ గారణ మేమి?

శిష్య— ఓయుపాధ్యాయుఁడా! దృష్టమున ననుపపత్తి యుండదుగదా!

ఉపా— దృష్ట మేమి?

శిష్య— మహర్షి యయ్యును సమరసమారంభదురాగ్రహము వదలినవాఁడు కాఁడు?

ఉపా— అతనికిఁ దల్లిపోలికవలనఁ గలిగిన సమరవాంఛాపిశాచము యావజ్జీవమును వదలదు.

శిష్య— ఈభల్లంబులు వినిహతరిపుగజఘటాపార్శ్వవ్యాసక్తశల్యంబులనియు నీక్షురప్రంబులు విదారితవైరివర్గంబు లనియు నీ నారాచంబు లసమసమరసమారంభప్రవర్తితవైరివీరరుధిరధారాప్రవాహంబులనియు నీబాణంబులు సకల క్షత్రియగోత్ర నిర్దళనదుర్లలితంబులనియు సర్వదా యింత యమ్ములకట్టను మోయించుచుండు నాపరశురామునివలన నొక్కముక్కయుఁ జదువుకొనుట లేదుగదా తుండువలె నుండువాఁడను సైతముఁ జిక్కిపోతిని. నిన్నటి సాయంకాలము దశరథునిరాముఁడు నీలకంఠుని శరాసనము విఱిచెనని యతనితో యుద్ధంబునకుం బోవువాఁడై యిన్నిబాణంబులు కట్టగట్టి నానెత్తిమీఁదఁబెట్టెను. నేనవి మోయలేక భయంపడి రాత్రివేళఁ గాళ్ళచప్పుడులేకుండఁ గదలి పాఱిపోయి

వచ్చి యుపాధ్యాయుఁగా మీకాళ్ళఁ బడితిని గావున నన్ననుగ్రహించి విద్యార్థిఁగాఁ బరిగ్రహింపుఁడు. నే నతనియొద్దఁ జదువుకొననులేను, ఈయమ్ముల కట్ట మోయను లేను.

ఉపా— ఈవిషయమునే స్వర్గగమనపరిభావము గల్గిన మున్యతిథులవలన వింటి. వారు పురందరుఁడు కూడ భార్గవసమరసంరంభమును విని దశరథు నటకుం బిలిపించుకొని సత్కరించిపంపె ననికూడఁజెప్పిరి (ఆలోచించి) ఏండ్లుగడచినవాఁడును బదుగురజయించినవాఁడునునగు పరశురాముండెక్కడ ! పసితనపు మిసిమినొప్పారు ముద్దుమోమువాఁ డారాచగున్నయెక్కడ ! ఇద్దఱకు నంతర మెంతోయున్నది. (విమర్శించి) ఒకసారియే చూచితిని. అయినను నారాము ఖడుగ్రిండు సర్వదా నాకన్నులఁ గట్టినట్లే కనిపించుచుండును.

(అని యాకసమువంకకుఁ జూచి) కటకటా! పరశురామ!

చ. ధరణిభృదన్వయంబునకు దాయ పురాతనధన్వి వీనులన్
నరసినయట్టి పెన్ముసలి నవ్వులచేటిది; తాటకాంతకుఁ
గరమున విల్లుదాలిచినకందునుమాననివాని క్షీరకం
ధరు నెదిరించి పోరునఁట తా జమదగ్నిజుఁ డేలకొంకఁడో.

శిష్య— ఉపాధ్యాయా! ఇట్టిపరాక్రమము గలపరశురాముఁ డల గిరీశశరాసనంబే లారోపింప లేదో.

ఉపా— ధనుర్విద్యావిశారదుఁడాతఁడు సబ్రహ్మచారు లెంతప్రేరించినను పలుదడవ లిట్లు బదులు చెప్పియూరకుండెను.

శా. నాయాచార్యులవారు వా, రెపుడుఁ దన్నామాక్షరోచ్చారమేఁ
జేయఁగారా దఖిలాస్త్రవేదమును దచ్ఛిష్యుండనై నేర్చితిన్;
బ్రాయంబుం జనెఁదాల్చితిన్ మఱియిటుల్ పై ఖానసత్వంబు, నా
చే యావిల్లెటులెత్తు సీతకయి యిస్సీ యెంతలావుండినన్?

శిష్య— ఉపాధ్యాయా! యీపరశురామరఘురాముల సమరసంరంభమున జయ మెవరికిఁ జెందునని మీరు తలఁతురు?

ఉపా— (ఆలోచించి) భవభూతీ! యిరువుర పరాక్రమంబు నెఱింగిన వాఁడఁ గాన నేనెటును నిశ్చయింపఁజాలకున్నాఁడను.

చ. హరుఁడు గనుంగొనం దురమునందుఁ గుమారు జయించె నొక్కఁ, డా
హరునిశరాస మొక్కఁడు లతాంతముఁ ద్రుంచినరీతిఁ ద్రుంచె, ని

ద్వారు సరిలేనిలావుగలపోటరు; లందుజయంబు హెచ్చ శం
కరకరుణాకటాక్షములు గల్గినవానిది గా(గనంబడున్.

(తె ర లో)

క. కుండినపురహవిభండక శాండిల్యప్రముఖవిబుధసంయములారా
రండు కనుంగొం దని రాకుండిన నారదు(డు తిట్టకుండ(డు సుండీ.

సీ. రాఘవుం డెదిరి భార్గవుతోడ( దల(పడు గను(గొను(డయ్య దిక్పాలురార
రామపరశురామరణము కంటికివిందు దయచేయు(డయ్య గంధర్వులార
దశరథాత్మజజామదగ్న్యులయని( జూడ( బదు(డయ్య కిన్నరస్వాములార
పార్వతీనాథవిశ్వామిత్రశిష్యులకక్ష గన్గొను(డయ్య యక్షులార.

గీ. వేగ రావయ్య వెనకయ్యవెనుక వా(డ
యూ(త( గొని రా(గదయ్య లంబోదరయ్య
చంద్రభాస్కరులార! యీసమరమునకు(
గోరి దయచేయవలె( జూడీ మీరు( గూడ.

శా. రా రంభా! మెనరా ఘృతాచి! భ్రమరీ! రా. సుందరీ రా. సుకం
ఠీరత్నప్రభలార! రండు. కలకంఠీ! రమ్ము! రావే, సుధీ
రా! రామానెదుసుమ్ము చిత్రలతరో! రావమ్మ సౌదామినీ!
చేరంబో(దగు నే(డు మీకు( బతి(గా శ్రీరాము(డో రాము(డో.

ఉపా— నాయనా! భవభూతీ! కలహకుతూహలి యగునారదుం డాగ్రహాను గ్రహము లతోనందఱను సంగరంబునకు( బిలుచుచున్నా(డు! మనము( గూడ నాతనితో( బోదము రమ్ము (అని నిష్క్రమించుచున్నారు)

(పిదప మాతలిసారథికంబగు రథంబుతో( జామరవాహినియగు సౌదామినియుం దశరథమహారాజును బ్రవేశించుచున్నారు.)

దశ— (అంతట( గలయంజూచి) అహాహా! వికసించిన పారిభద్రపు(బూలగుత్తివలె రమణీయమగు నరుణసంధ్యారాగముగల యీయంతరిక్షమం దుంటిమి. గగన గర్భమున ప్రాతఃకాలరామణీయకం బెంతవింత గొల్పుచున్నది!

ఉ. పైకిని గ్రిందికిం గలయ( బ్రా(కెడు బాలవివస్వదంశువుల్
చీ(కటులం దివిన్ భువిగ్రసింప(గసాగె సమంబుగా(గ మం
దాకినిలో( బ్రభాతసమయంబునయందును లేఁతతమ్మిపూ
రేకులకున్ వికాస మలరెం గడునాకులభావ మొప్ప(గన్.

చ. తెలతెలవాఱఁ దా బయలుదేఱినయప్పుడు మ్రోగుడిండిమం
బుల వినువీధి హెచ్చరికఁబొందుచు ముందటి మావటీళ్ళు దం
తుల నొదిఁగింప దేవధుని తోయములో మునుఁగంగ వచ్చె వే
ల్పుల తెలియేన్గు ధూతతటలూసశిలాదశనాగ్రభాగమై

(స్మరణమభినయించి) ఆర్యా! మాతలీ! ఇరుబుజంబుల వ్రేలాడు సంతాన ద్రుమమాల్యంబులు సురసుందరీ కరాందోళితచారుచామరాగ్ర చుంబ్యమానంబులై కదలుచుండ ననేకంబులగు షోఁకుమూఁకలం గీటడఁగించిన శచీనాథుండు "మిత్రమా! దశరథ! నీవు వేగమ మిథిలాపురంబున కరుగుము. భూలోకసంచారంబునకు ముదల యీఁబడిన మాచారణవారు లోకవార్త నేఁడు మాతోఁ జెప్పిరి మిథిలాపురంబున హర శరాసనంబు పణంబుగా నిశ్చయింపఁబడిన సీతాస్వయంవరమునకు వచ్చినరాజు లంద ఱాశరాసన మారోపింపలేమిఁగుందుచు లజ్జామాత్సర్యరూషానసులై చూచుచుండఁగా —

చ. చిలువల తేఁడు త్రాడు సరసీరుహలోచనుఁ డమ్మ పైఁడిగు
బ్బలియెకిమీఁడు గాత్రము క్షపాకరమౌళి ధనుర్ధరుండుఁగా
వెలసిన దివ్యవైభవపువింటిని దా నలవోకఁ దాల్చి దో
ర్బలమున రామచంద్రుఁడట భగ్నముఁజేసెసఁ టొక్క వ్రేల్మిడిన్.

తరువాత గురుచాపంబువిఱిచెనని పరశురాముండు కోపించి రామభద్రువితో యుద్ధంబొనరింపఁబోయెనఁట నీవునుదత్ప్రతీకారంబొనర్చి వధూవరుల నయోధ్యకు నంపించి పిదప సురకార్యశేషంబు నిర్వర్తింతువుగాక" యని యానతిచ్చె.

మాత— అయిన వేగముగా రథము పోనిచ్చెదను.

దశ— మాతలీ! మనదేవేంద్రుఁడుగారికిఁ బరశురామునియెడం గలుగుగౌరవ మెటు వంటితో యెఱుఁగుదువా.

మాత— చాలగౌరవము కలదు వినవలతురేని వినిపించెద.

గీ. నందనమునందు దేవయానంబునందుఁ
గూర్కుటింటను దమకొల్వుకూటమందు
రేణుకాసుతుచిత్రచరిత్రలెల్లఁ
జిత్రరచనచేయించి వీక్షించుచుండు.

ఎక్కడనో యేల మన మెక్కినయీరథము నాల్గుప్రక్కలయందును దచ్చరి త్రచిత్రములే చిత్రింపఁబడియున్నవి. (వ్రేలజూపించుచు) ఇది పురారివలనధనుర్వేద మభ్యసించినచరిత్రము.

దశ— ఇదిగో! ఇక్కడఁబెద్దతాలు గల్గినకొండ యున్నది. హిమానీసముపేతంబు లగు దీనినెత్తమ్ములు చూచిన షంచుంగొండ యని తోఁచుచున్నది.

మాత॰ చ. ఇది హిమవద్గిరీంద్రమె మహేశ్వరుఁడుం గిరిపుత్రియున్ వసిం
చుదు రిట, దీనినెత్తముల జూదములాడుచు వేల్పుటాండ్రు రె
న్నుదురు భవచ్చరిత్ర, మదనుం దనుమంతుని జూచినట్లు చె
ప్పుదు రిటవారు మూలికలమూలమునం పరిభూతమృత్యువుల్.

చ. ఇతఁడు మహేశ్వరుండు త్రిదశేశ్వరవంద్యపదుండు శిష్యసం
తతికి శరాసనాగమవిధానముఁ జక్కఁగ నేర్పుచున్నవాఁ
డితఁడు గజాననుండు గుహుఁ డీతఁడు తక్కినవారు వీరు సు
వ్రతులగు భార్గవాదులు కరంబులు మోడ్చుచునున్నవారొగిన్.

దశ— మాతలీ! ఏమి! ఈభార్గవునియదృష్టము! భగవంతుండగు చంద్రయౌళియే యిమ్మ
నుజమునీంద్రున కాచార్యకంబు సేయుచున్నాఁడు.

శౌదా— ధనుర్వేద మభ్యసించియు సాము నేర్చుకొనుచున్న శిష్యు లిచ్చటనే యున్నారు.
దవ్వులకుం బోవుటయు గుఱివాయమియు గాఢముగాఁ దగులుటయు మున్నగు
రామబాణముల విశేషము లిచ్చటఁజిత్రింపఁబడియున్నవి.

మాత— ఆహా! ప్రతిభాప్రకర్షకుఁజాల హెచ్చుతగ్గులు గలవు ఏలన—

చ. హరుఁడు సమంబుగా వటువు లందఱకుఁ విలువిద్య నేర్పె. న
గ్గురుకృప శిష్యులంద ఱొకకూడికగా నదియెల్ల నభ్యసిం
చి, రయిన నందు బుద్ధివిశేషఁ దనందగె భార్గవుండ; లో
నరసిన సత్క్రియావిధుల నొఁగద ప్రత్తియె యజ్ఞసూత్రముల్.

(ముందుఁజూచి) దేవా! యిటుఁజూడుము. పినాకివాత్సల్యము.

గీ. తనయులు గుహుండు గణపతి వెనుకొనినను
జేకొనక, ప్రజ్ఞమెచ్చి పినాకపాణి
సతతధృతనాగమైన హస్తంబుచేత
భార్గవుని వీపు తట్టు సేబా సటంచు॥

(మరల ముందుఁజూచి) మహారాజ! దశరథ! యిచట ఖురళీకలహంబునకుం
జొరఁబడిన త్రినయనాంతేవాసుల కలహము ప్రారంభింపఁబడినది! అచటఁ గోదండ
పాండిత్యంబునకుం దగినకలహము మొదలిడిరి.

దశ— ఇది యట్టిదే—

చ. అదురుఁ గనుంబొమల్ నిటలమం దలుకం గురిపింప భార్గవుం
డదరుచు వింటితాడు మిళితాంగుళికంబగుకేల లాగ నా

రొదకు షడాననుండు గడు రోయుచు పీనులు మూఁడునాల్గులుం
జెదరఁగ ఖిన్నుఁడయ్యె నిరుచేతులచే నవి మూయఁజాలమిన్.

సౌదా— ఇచ్చటఁ గైలాసశైలాగ్రంబునందుండి చండికానాథుండు నంది మొదలగు ప్రమథపరివారము తోడం బార్వతియుం దానును గుమార లంబోదరులు పరశు రాముతో నొనర్చు సంగరం బాలోకించుచున్నాఁడు.

మాత— కేవలము చూచుటయే కాదు, తా నుపదేశించిన ధనుర్వేదోపనిషద్విశేషములు చూపించు శిష్యునివాకచక్యమునకు మెచ్చుచున్నాఁడు.

మ. సరసాటోపవినీతిరీతులు ధనుష్పాండిత్య మందింత కి
ర్వురలోనెవ్వరు ముల్లుసూపఁగలవారో యంచు శీతాంశుశే
ఖరుఁ డద్రీంద్రకుమారి కేలుగొని యిక్కైలాసశైలాధిరా
ట్శిరమందుండి కుమారభార్గవుల వీక్షించున్ సముద్గ్రీవుఁడై.

దశ— మిగుల సంతసించుచున్నాఁడు: ఏలన——

ఉ. నంది ముదంబుఁజెంద గణనాథుఁడు నవ్వుచుఁ గేరుచుండఁగాఁ
జంకురుఁ డిట్టిటు ల్దిరుఁగ చండుఁడు జండచరిత్ర చూప నా
నందముతోడ భృంగిరిటి నాట్యమునల్పఁ బురారి గౌరితో
నందనుకంటె శిష్యుఁ గరుణాపరుఁడై కనుచుండెఁ గంటివే.

మాత—. మహారాజ! యిట్టిటుఁ జూడుము. హాస్యాద్భుతరసంబు లొక్కయెడ నావిర్భ వించుచున్నవి.

చ. కరమున గొప్పవిల్లుఁ గొని కాండపరంపరలెత్తి వైచుచుః
బరశువు తొండపుంజివరఁ బట్టి లసద్దశనాగ్రఘట్టన
స్థిరముగ విక్రమించుమను జేటచెవుల్ మొగమందుఁ గప్పుచున్
దొరలుచు గుజ్జువేల్పు రణధూర్వహుఁడై యనిఁ దేజరిల్లెడుః.

క. కరిచేష్టలు నరచేష్టలు, పరిహృతరుద్రాంబకప్రభావంతములై
గరువం బొడఁగూర్పఁగ నచ్చెరువొనరించుం గజాస్యచేష్టలు గంటే.

సౌదా— గజవదన సమరజనిత దురాగ్రహగ్రస్తుఁడగు పరశురాముండు సమరరంగం బంతయు గణశూన్యంబొనరింపఁ దలంచినట్లు తోఁచుచున్నది.

దశ— సేబాసు సౌదామినీ? సేబాసు! నీ పలినమాట నిజమే.

చ. గణములు భీతిఁ గాల్కొలఁదిగాఁ బరువెత్తిరి వెండికొండకున్
గణపతి నందియున్ భయమునన్ విడనాడిరి పిండ్లతోడ మా

ర్గణముల సంచు; లిట్లడరుగా బల మోహటిలంగఁ గొ్రించదా
రణుఁ డొకఁడే యెదుర్కొనియె రాముని నవ్వుచు వాఁడియమ్ములన్,

(ముందుఁజూచి) పరశురాముని యెదుట నేవియో యక్షరము లున్నట్లున్నవే (అని చదువుచున్నాఁడు)

శా. అంతేవాసిని నేను బుత్రికుఁడ వీ; వర్ధేందుకోటీరు సు
స్వాంతం బొక్కనిపై విశిష్టమగు చెః ట్లాధారవైశిష్టి నా
యంత న్నా కగునంటివేని వినురాః యాధేయవైశిష్ట్య మీ
చెంతం గల్గుఁ గుమారః రార యని నీచేలావు చూపించురా,

మాత— మహారాజ దశరథః పురోభాగం బవలోకింపుము. కుమారు నెదుర్కొను పరశురాముం గని లంబోదరుం డడ్డుపడ నాతనిపై జ్యోతిశ్ఛటాచ్ఛాదిత రోదఃకటాహంబగు పాశుపతాస్త్రముం బ్రయోగించుచున్నాఁడు.

దశ— ఇదిగోః ఇచట నొకయక్షరపఙ్క్తి కలదు (అనిచదువుచున్నాఁడు.)

ఉ. వచ్చినయల్కకుం గురులవాకిలిగాచి పరిశ్రమింపఁగా
వచ్చిన విద్యకున్ బ్రిబలబాహుబలంబునకుం బినాకికి౯
నచ్చినయట్టి శిష్యత కనర్హముకాని శరంబుచేత నీ
వొచ్చెమడంతు నోరిగణముఖ్యః భవత్సహజుండు చూడఁగన్.

మాత— ఇంతలో మఱియొకచిత్రము జరగినది.

ఉ. కోపకషాయితుండయి భృగుప్రవరుండు గజాస్యు నొంచఁగాఁ
జాపమునందుఁ బాశుపతశస్త్రము వేఁ దొడునంతలో రణ
న్నూపురయై భవాని మొలనూలిమణుల్ దిగజాఱఁ బైఁటయుం
బైపయి జాఱ నడ్డుపడె భర్గుఁడు నవ్వుచుఁ జూచుచుండఁగ౯.

దశ— (ముందుఁజూచి) ఆహాః స్వభావముచే నుద్ధతుండగు పరశురామున కీవినయాతిశయముః దీననే యితనిచరితంబు ముల్లోకంబులచేఁ గొనియాడఁ దగినదిగా నున్నది.

శా. చాలుంజాలుర రామః శస్త్రమరివోఁజాలించురా యంచు నా
ప్రాలేయాద్రికుమారి యడ్డుపడి చేరంబోవఁగా బాణ ము
న్మాలించె౯ విలు పాఱవై చెఁ జరణాంభోజమ్ములందుం బడెన్
లోలంబైన జటాచయంబు మునుముందుం గాళ్ళపై వ్రాలఁగన్.

సౌదా— ముక్కంటి కీమునిపైఁ గల కూర్మి యనిర్వచనీయము.

దశ— (చూచి)

ఉ. చెంగట నొదలన్ మొగుపుచేతులు దాలిచి నమ్రుఁడై నయా
సంగరభీము రాముఁ గని సంతసమందుచుఁ జంద్రమౌళి మున్
బంగరుఁగొండ సానువుల భగ్నమొనర్చెడివేళ ఖండమై
తుగ్రింగిన గండ్రిగొడ్డలిని దోకొనుమంచు ననుగ్రహించెడున్.

క. ఆనందమంది విద్యాస్థానంబులు పదియునా ల్గతని కంతట నీ
శానుండు నేర్పె; నిల నెన్నైన శుభములిడునుగా మహాత్ములకూర్మల్!

సౌదా— నాఁటఁగోలె రాముఁడు పరశురాముఁ డాయెనని తలంచెద.

మాత— మహారాజా! ఇటుచూడుము.

చ. అనుదినముం బ్రిపాఠమునకై గురుసన్నిధికేఁగకుండఁ దో్రి
వనడఁచి క్రౌంచపర్వతము పైకొనఁగాఁ గని యొక్కవాఁడియ
మ్మున నొనరించెఁ బెద్దబిలముం ధనరాకకుఁ బోక; కట్టితో్రి
వన యొనరించు నేఁటికి నుపర్వసరోగతి రాజహంసముల్.

దీనికేమి, యిటుచూడుము! ఒకదెసఁబితృభక్తియు నొకదెసమాతృహత్యయుఁ గూడ జరగుచున్నది.

దశ— పాపము శమించునుగాక! జమదగ్నిసుతుండును బొరపడుచున్నాఁడేమాతలీ

గీ. తండ్రికంటెను బదిరెట్లు తల్లి గౌర
వమ్మునం దెక్కువనుటది సమ్మతంబు
తండ్రియెడ భక్తిచూపింపఁదలఁచి తల్లి
శిరము నఱకునె కటకటా పరశుధరుఁడు

ఆలోచించిన నీప్రమాదము జమదగ్నిదికాని పరశురామునిది కాదు. (ఆలోచించి) భృగువంశమందుఁ బుట్టియు భృగునీతిచదివియు నితఁడిట్టి పితృభక్తిచూపించుచున్నాఁడే! స్మృతి చెప్పుచున్నదిగదా!

గీ. చేయఁదగినట్టికార్యంబు చేయఁదగని
యట్టికార్యం బెఱుంగక యాతతాయి
వడువున నమార్గమున్న జనువాని గురువిఁ
దండ్రినైనను వదలుట ధర్మమగును.

సౌదా— (చెవులు మూసికొని) భగవంతుఁడు పరశురాముఁడెట్లు దీనిఁ జెవులతో వినెను! వినెఁగాక యెట్లు పనిగొనెను?

మాత— మహారాజ! యిటుచూడుము.

దశ— బొరా! ఈపరశురాముని తల్లికి మరలఁ బ్రాణమువచ్చినది

క. తనచేసినపని కలరిన జనకునివలనన్ వరంబు జనని పునర్జీ
వినిగా భృగుతిలకుఁడు కోరినయంతన మొందె మతికె రేణుకతలతోన్.

సౌదా— చంపియుమరల బ్రితికింపసమర్థుండగు నీపరశురామునకు జననీశిరశ్ఛేదంబును శోభాకరంబుగానే యున్నది.

దశ— ఆర్యా సౌదామినీ!

చ. జననినిజంపెఁ దాతవరశక్తిని, దా బ్రితికించెనిట్లు పే
ర్చినభృగురాము నద్భుతచరిత్రము సన్నుతిచేయఁదగ్గద
య్యును నుతియింప సిగ్గుపడుచుంటిమి; పెద్దల నెన్నఁబూనఁగా
మనసగుకంటెఁ దామొక నమస్కృతిచేయుట యుక్తమేరికిన్.

మాత— మహారాజ! ఇది చూడఁ దగినవిచిత్రము.

దశ— ఇతఁడు వేయిచేతులుగలవాఁడని మనమువినుచున్న కార్తవీర్యార్జునుఁడేకాఁడు

మాత— ఆఁ! అగును! ఈచిత్రమవలోకింపుము.

ఉ. పావనసావనంబు మునిపల్లియ కల్లదెవచ్చె హైహయుం
డావల భార్గవుం డతని కర్ఘ్యవిధానము లాచరించె నీ
త్రోవన రాజు హోమగవిదూడను బల్మిహరించె దాన నా
హావడి పోరుపోరి జమదగ్నియుఁ బ్రాణముఁ బాసెనల్లదే!

సౌదా— వేయిచేతులుగల యీ పుడమిఱేఁడు రాచకొలమునకుందగని పనిఁజేసెను. సమరభూమింబడియున్న మగనిం బ్రితికించుటకయి పయింబడియేడ్చుచున్న పతివ్రతాశిరోమణిని రేణుకమ్మం దలపట్టి యీడ్చి కృపాణధారలం దాడించుచున్నాఁడు.

దశ— గొప్పవారుగూడఁ బ్రమాదముల పాలగుదురేల! సంసారభోగము లనురాగముల రేఁగఁగొట్టునన్నమాట గదా!

మాత— మహారాజ! ఇచట మహావీరుండును బృష్ఠభాగలంబమానతూణీరుండును బరమేశ్వరోపదిష్టధర్మ్ముండును సన్నద్ధీకృతకార్ముకకర్మ్ముండును బరశుధారారోచిరుజ్జృంభమాణడామరుండును సమరపరితోషితామరుండును సమరాభిరాముండు నగు పరశురాముఁడు సకలారణ్యకనివేదితవృత్తాంతుండై సాక్షాత్కృతాంతుండునుంబోలె నమరసంరంభవేషంబుతో నిటుకదలి చనుదెంచుచున్నాఁడు.

ఏమీ! ఇది యక్షరపఙ్క్తి! (అని చదువుచున్నాఁడు.)

శా. ఓరీదుష్టనృపాల! వృద్ధుని సతీయుక్తున్ సదాచారు వి
ద్యారాశిన్ బుధశీలు మజ్జనకు సత్యజ్ఞానసంపన్ను ని

దధి— సింహనాదుని యైదుమొగంబులొక్కసారి సంక్షోభమును బొందినవి.

కపి— రెండుచేతు లప్పళించి పెద్దహుంకార మొనరించి సింహనాదుఁడు దేవతాసుంద రులు చల్లుపుష్పములు క్రిందఁ బడకుండఁ బుడమినుండి పరాగంబు పైకెగర కుండ రవికిరణంబులైనఁ జొరకుండ బాణవర్షము కురిపించుచున్నాఁడు.

సింహ— (ముందుజూచి) ఓప్లవంగపశువులార!

గీ. నాకుఁ గలయుద్ధశక్తిసన్నాహములకు
మీర లెదిరించినంత నేమియగునొర
రాముఁ డొకవీరుఁడఁట తత్పరాక్రమంబు
చూడఁగావలె నాతఁడెచ్చోటఁ జెపుడ?

(మరలముందుఁగని) ఈవానరకీటకకోటులను జయించిన నేమిపరువు? (చేయిపైకెత్తి)

గీ. అనియొనర్చెద నొక్కపెట్టున ధనుస్సు
లేను ధరియించి, గెలువుఁడో యేనుచేతు
లార! సుగ్రీవమారుతి లక్ష్మణులను
రామునంగదుఁ; దక్కువారలను వలదు.

(మరల ముందుఁగాంచి పెద్దనవ్వునవ్వి) వానరయూధపతులందఱు తోఁకలెగనెత్తి పరువెత్తుచున్నారు. (బిగ్గరగా)

గీ. కష్టపడి కట్టుకొన్నట్టి కట్ట కలదు
త్వరగ వచ్చినదారి మీవాసములకుఁ
బొందు సుగ్రీవమైందకుముదకపీందర్
తనయవీలద్వివిదనలతారులార.

రామ— వత్స లక్ష్మణ! వీనిమాటలు బహుచిత్రములుగా నున్నవి!

లక్ష్మ— (గర్వముతో నెదుటికివచ్చి) ఓరీ వికృతాకార! దురాచారా! నరమాంస కబళనదక్ష! రాక్షసాపశద. చాలఁబ్రల్లదములు పలుకుచున్నావేమిరా! ఎన్నడును వీఱులయంపపెట్టుటుంగ నట్లున్నావు!

సింహ— (వినక వానరులఁ దఱుముచు ఓప్లవంగపశువులారా! "గీ. నాకుఁగల యుద్ధశక్తి" అను పద్యము చదువును)

రామ— సెబాసు సింహనాద! వీరవరిష్ఠుండగు దశకంఠుని సిగ్గుపఱుచుచుంటివి.

సింహ— (అభిముఖముగా నిలచి)

గీ. రామ! ముం దస్మదీయశరప్రయోగ
విధికిఁ బాలైతివేని జీవింప వీవు
గాన ముందుగ నీ యాశుగంబు పఱపు
మోరి నీదెబ్బ రుచిచూడఁగోరియుంటి.

రామ— (ధైర్యముగా నిలువఁబడి చిఱునవ్వు నవ్వి) ఓరీ సింహనాద!

క. సీతను విడి చూపఱకుం గౌతుకముగఁ బుడమినుంచకయె నీమంత్రి
శ్రీనితండ్రియు నీయన్నయు నీతమ్ములు నిన్ను ముం దనికిఁ బంపిరిసీ!

సింహ— ఓరీ! రామ! చాలగర్వింపకుము. ఇంతగర్వమునకుఁ గారణములేదు. నీ చరిత్రలు విన్నమాకును సిగ్గగుచున్నయది.

గీ. పడతి తాటక విప్రుండు భార్గవుండు
మృగము మారీచుఁడు వనమృగము వాలి
ఓరి నీవు జయించిన వీరుఁ డెవ్వఁ
డైనను మదించితేని విల్లూను మెదిరి.

లక్ష్మ— (నవ్వి) గీ. ఆఁడుదే యౌను దాటక యైన దాని
జంపుటకుఁ గారణము మౌనిపంపుసుమ్ము
మృగమనెడుమాట నిజమె మారీచుఁ డైన
రాజయినవానికెల్ల ధర్మంబు వేఁట.

బ్రాహ్మణుఁడగు పరశురాముని జయించుటకుఁ గారణము మావైతాళికుఁడే "అనిజంభునిజంపిన యింద్రుని" అని చెప్పియున్నాఁడు. ఇఁక వాలిని జంపుటకు సమాధాన మొక్కటి చెప్పవలసియున్నది.

రామ— లక్ష్మణా! నీవూరకుండుము. దాని కుత్తరము నేను జెప్పెదను.

గీ. క్రోఁతి యని వాలిననకుము కొంపములుఁగు
నమలినం బగు నీతండ్రియశము గూడ
నాల్గువారాసులను ముంచి నాన్చెఁగాదె
చంకలో నొక్కిపట్టి నీజనకు నతఁడు.

సింహ— (క్రోధముతో) ఓరోరీ కుక్షత్రియ! మాతండ్రి నాక్షేపించుచున్నావు! ఇదిగో వాఁడియమ్ముల నీరూపు మాపుచున్నాను.

రామ— (విల్లెత్తి) ఓరీ రాక్షసపోత! నేనుమాత్ర మూరకుందునా. లంకాపురీపరిసర గోపురములయందుండి చూచుచున్న పౌరజను లందఱు మనశరవిక్షేపములకు బెదరుదురు. కావున నావలికింబోయి యుద్ధము చేయుదమురా.

(అని యందఱును నిష్క్రమింతురు)

ఇది .... శ్రీతిరుపతివేంకటేశ్వర విరచితంబగు నాంధ్ర
బాలరామాయణ నాటకమున సప్తమాంకము.



శ్రీమత్పరదేవతాయైనమః

# బాలరామాయణము



## అష్టమాంకము

(పిదప సుముఖదుర్ముఖులను నిరువురు రాక్షసులు ప్రవేశింతురు.)

సుము— సఖా! దుర్ముఖ! మనరావణ మహారాజునకు గొప్పసహాయలోపము తటస్థించినది. కుమారసింహనాదుడుగతించెఁగదా! అయినను శోకామర్షంబులపాలుగాక తులాద్యూతమనునది యొకటి పన్ని, యందును బరాభవముఁజెంది పందెముగా నిర్ణయించుకొనిన సీతాసమర్పణంబును లంకాధిపత్యపరిత్యాగంబును జేయఁడాయే.

దుర్మ— ఆర్య! సుముఖా! స్వామినియగు త్రిజట మనల నిరువురను. "అంగదునకును నరాంతకునకును జరుగు యుద్ధములోని విశేషము లరసినాతోఁ జెప్పిన నేను సీతాదేవితో విన్నవింతును" అని నియోగించుటయే యెఱుఁగుదునుగాని వారిపోరాటకుం దగిన కారణ మెఱుంగను, నీకుందెలిసినఁ జెప్పుము.

సుము— మనరాజు శుకసారణులను రాము నొద్దకుఁ బంపఁగా వారేగి, రామునితో మనము వానరబలమును రాక్షసబలమును వ్యర్థముగాఁ జంపుకొనుట భావ్యముగాదు. తులాద్యూతమువలన జయాపజయములు నిర్ణయించుకొందము. పందెమేమనఁగా—

గీ. అందు నీవాఁడు గెల్చిన నవనిజాత
నీకళత్రంబు లంకయు నీయధీన
మగుట, నావాఁడు గెల్చిన నవనిజాత
నాకళత్రం బయోధ్యయు నాదియగుట.,,

అని రావణుని మాటలుగా విన్నవించితి.

దుర్మ— తరువాతఁ దరువాత.

సుము— తరువాత రామభద్రుండును బ్రహ్మకు ముమ్మనుమండగు రావణుఁడు చెప్పినట్లే జరుగ వచ్చును అని ప్రత్యుత్తరమిచ్చెను.

దుర్మ— తరువాత తరువాత.

సుము— తరువాత సౌమిత్రి సుగ్రీవ విభీషణ జాంబవ దాంజనేయ ప్రభృతులందఱు వలదని నివారించినను రాముఁడు తనవైపున నంగదు నంకకారుఁగా నియమించెను. రావణుఁడును దనవైపున నరాంతకు నంకకారుఁగా నియమించుకొనియె.

దుర్మ— తన భుజపరాక్రమ మెఱుంగకయే మనరాజు లంకాధిపత్యమంతయు నరాంతకుని వీపుమీద నుంచినాఁడేమి ?

సుము- తెలివితక్కువపనులు చేయుటయందు మనరాజుగారగ్రగణ్యులుగదా, యింతేకాదు.

గీ. సింహనాదుఁడెపుడు మడిసెనో స్వశక్తి
యెపుడు వమ్మయి పోయెనో యప్డె రామ
చంద్రునకు సీత నిచ్చుట సముచితంబు;
రాజమోహంబచుమి కాలరాత్రి మనకు.

దుర్మ— యువరాజు మేఘనాదుఁ డేమయ్యెనో.

సుము— ఏమయ్యెనా,

చ. నడి నిసి వేళ రాఘవుల నాగశరంబులఁ గట్టినాఁడు క
న్పడ కనిసేయు నేర్పరి నభంబున నుండియె నిత్యజైత్రమై
వెడలురథంబువాఁ డొరుల వేఁడక యగ్నినె కొల్చువాఁడు బి
ట్టడలి యడంగె రాఘవభయంబున నొక్కెడ మేఘనాదుఁడున్.

చ. జలనిధి చుట్టు నుంటఁ జొరశక్యము గానిది లంక, దేవతా
లలనల యూడిగంపుఁ బనులంగొను రావణుఁ డేలు దానిఁ గోఁ
తులబలగంబుతో వెడలి తోయధి కడ్డముఁ గట్టి వాని దో
ర్బలమున గెల్చు మర్త్యుడఁట రాఘవుఁ డక్కట సిగ్గు సిగ్గుఁగా.

దుర్మ— నిజము నిజము, చర్మేంద్రియములకు గోచరము గాని సంగతి యార్యులకుఁ బొడఁగట్టినది.

సుము— చాలుఁ జాలు. రాజవిరుద్ధము లగు మాటలు చెప్పుకొనరాదు మనపనిమనము నెఱవేర్చుకొందము.

దుర్మ— త్రిజటమ్మగారు మనరాకకై యెదురు చూచుచున్నది. అచటికే పోదమురా (అని పరిక్రమింతురు.)

(పిదపఁ ద్రిజట ప్రవేశించును)

త్రిజ— (ఔత్సుక్యముతో ముందుఁజూచి) ఓహో ! సుముఖదుర్ముఖులా ! త్వరగా రండు, యుద్ధవృత్తాంతము చెప్పుడు.

సుము— స్వామిని త్రిజటా! లంకకుఁ దూఱుపువైపును సువేలాద్రికిఁ బడమటివైపును నగు రత్నాక్షవాటంబునఁజూపఱందఱును సమంబుగాఁ జూచుటకై క్రిమక్రిమోన్నతంబులగు మంచంబు లలంకరింపఁబడినవి. అందుఁ దూర్పువైపున సపరివారుండగు దశాననుండును బడమటివైపున సపరివారుండగు రాముండును గూరుచుండిరి. సద్దుచేయకుండ వానరబలంబునకై నీలుండును రాక్షసబలంబునకై ప్రహస్తుండును నియోగింపఁబడిరి. అందఱు నిట్లుండ దేవతాంగనలు విమానంబునుండి చూచుచుండ నంగదనరాంతకు లిరువురును గత్తులు చేఁత బూని రణరంగముం బ్రవేశించిరి. తరువాత.

గీ. ముచ్చరున రత్నకంకణముల ప్రకోష్ఠ
ములును గందంపు మేనిపూఁతలుగలట్టి
యంగదనరాంతకులరూప మరయ ననిమి
షత్వమును మెచ్చుకొనిరి యప్సరసలెల్ల.

త్రిజ— తరువాతఁ దరువాత.

సుము— తరువాత నీలప్రహస్తులు మంచంబులు దిగి బరాబరులుసేయుచు సేనలు మూయకుండ నడుము నెడము గలుగఁ జేయుచుండఁ బ్రత్యాలీఢపాదంబులతో నాయంకకారు లిరువురు నెదుర్కొని మండలాకారంబుగ రణాంగణంబునం దిరుగఁజొచ్చిరి

త్రిజ— తరువాతఁ దరువాత ?

దుర్ము— తరువాత వారిరువు రందముగా మరలి తిరుగుచు నుపరితాడనంబులు లాఘవంబుగాఁ దప్పించుకొనుచు నొండొరులం బిలచికొనుచు వీరాలాపంబులాడుకొనుచు దృష్టులువంచించుకొనుచు శస్త్రక్షతములగు శరీరంబులు రక్షించుకొనుచు, నొక చోటఁ గొట్టునటు లుంకించి మఱియొకచోటఁగొట్టుకొనుచుఁ బెద్దలపేరు లుగ్గడించుకొనుచు బిట్టు చిత్రముగాఁ బోరిరి.

త్రిజ— తరువాతఁ దరువాత ?

సుము— తరువాత

ఆ. వాలినందనుండు ప్రహరించి నపుడెల్లఁ గీశసేన సేసెఁ గిలకిలంబు.
రావణాత్మజుండు ప్రహరించి నపుడెల్ల సోఁకుమూఁక చేయఁ జొచ్చె గోల.

త్రిజ— తరువాత దరువాత ?

సుము— తరువాత నాయంగదనరాంతకు లిరువురును,

క. సొగసుగ నడ నడచుట సొగసుగ వసుమతి నాక్రమించి చూచుటయును మృ
న్నగు గతులన్నియుఁ గడు వేడ్కగ సూచికలయ్యె నంకకారులకెల్లన్.

త్రిజ— తరువాతఁ దరువాత ?

దుర్ము— ఇట్లునిర్భరంబుగఁ బోరుచుండ నరాంతకుండు తనకాల నంగదుని కాలికి సంకిలివైచి కేలంబట్టుకొనియున్న సమయంబున రోమాంచనిబిడరత్నాంగదుండగు నంగదుం డతనిమెడపట్టునఁ గత్తితోఁ బొడువఁ బ్రిలయకాలవాయువుచేఁ గూలిన పారిజాతద్రుమమువలె వాఁడు రజనీచరాంగనల కన్నీటితోఁ గూడ నేలంబడియె. వానరవీరులందఱు క్ష్వేళారావంబు లాచరించిరి. దశానను పది మొగంబులును ముకుళించిన తమ్మిపూవుల చందంబు వహించె. రక్కసులుచూడకుండఁ గరతాళధ్వనులతో నచ్చరలందఱు నవ్వసాగిరి.

త్రిజ— హావత్స. నరాంతక. యెచటనుంటివి. మాఱుమాటాడవేమి ? దుర్ముఖా ? నరాంతకుఁడు కూలినపుడు దేవతల ముఖచ్ఛాయలెట్లున్నవిరా.

దుర్ము— శత్రుపక్షమునఁ బరాజయము తటస్థించి నప్పు డున్నట్లున్నవి. స్వామిని త్రిజటా ! ఆక్షత్రియకుమారుని యందు దేవతలకుంగల పక్షపాత మింతింత గాదు. అవును; ధర్మవిజయముగల వారియం దెవ్వరికి పక్షపాతముండదు?

మ. దనుజాచార్యుని యొంటికన్ను బుధసంతానంబు కందోయి భ
ర్గుని నేత్రత్రయ మబ్జసూతి యిరునాల్గుం గన్నులుం గేకివా
హను పండ్రెండు విలోచనంబులును జంభారాతి వేగన్నులుం
గనె నుల్లాసముతోడ నంగదు భుజాగర్వంబు నింతింతలై.

త్రిజ— తరువాత నార్య దశకంఠుఁ డే మయియెను?

సుము— ప్రహస్తునితో నిట్లనియె

గీ. అని నరాంతకుఁ డణఁగిపోయెను గదా య
టంచుసమరంబు మాన్పకుమయ్య తాత
వానరులకును గీర్వాణవైరులకును
జరుగుసామాన్యయుద్ధంబు జరుగనిమ్ము.

త్రిజ— అట్లైన మనరాజుగారు లజ్జాదేవి నావలకు సాగనంపినారు.

సుము— తరువాత విభీషణుఁడు చప్పట్లు గొట్ట రాముఁడు నవ్వఁ గుంభకర్ణుని లేపుటకును నికుంభిలానిర్గతుండగు నింద్రజిత్తును బిలుచుటకును శుకసారణులను బంపి మనరాజుగా రంతిపురిలోనికిం బోయిరి.

త్రిజ— అట్లైన మీరుతరువాత వృత్తాంతముఁ దెలిసికొనుండు నేనిప్పు సీతతోవిన్నవించెద.

(అని అందఱును నిష్క్రమింతురు) ఇదిమిశ్రవిష్కంభము.

(పిదప నిరుపక్కల నిరువురిరువురు బరిచారికలతోడను వేత్రవతితోడను సుప్తోత్థితుండగు రావణుండు ప్రవేశించును)

వేత్ర— (తనలో) ఏమీ! దశకంఠదేవునకుం దటస్థించిన యవస్థ, యీ కేళీవిమానమునందే రత్నాట్టాలకంబునఁ బ్రొద్దుగ్రుంకినదిమొదలు వేఁగువఱకుఁ గన్నుమూయకుండ రజనీరణం బాలోకించి కించిత్కాలము విశ్రమించి మరల దివాయుద్ధముఁ జూచుటకై చనుదెంచె. ఇప్పుడును కొంచెము నిద్రచే మ్రాగన్నువడుచు నేదియో మనంబున నాలోచించుచున్నాఁడు.

రావ— భద్రురాలా, వేత్రవతి! ఎవనికి దేనియం దభిరుచి మెండగునో వాఁడుసర్వదా దానికే లొంగియుండును నన్నుఁ జూడుము, రాత్రియుద్ధముఁ జూచుటచే మిగుల డస్సియు మరల దివాయుద్ధముం గాంచుటకై చనుదెంచితి (అని యాకసము వంకకుంజూచి) దేవతలందఱు వేగముగఁ బరుగెత్తుకొని వచ్చుచున్నారు, పేరులేని రాక్షసులఁ గొందఱం జంపిన తాపసక్షత్రియు నభినందించుటకై కాఁబోలును,

ఉ. ఏల ముదంబు మీకు బలహీనులు దైత్యులు కొందఱీల్గినన్
వేలుపులార రావణుని విక్రమ మింతటిలోనఁ బోయె నే
కూళతనంబుమానుఁ డిదిగో! చనుదెంచెద రింద్రజిత్తు, ని
ద్రాలసవృత్తి లోకముల నాఁకలికింగొను కుంభ కర్ణుఁడున్.

వేత్ర— దేవా! రాజు లవసరసంతోషణీయులు కావున నుచ్చావచసంచారములతో వేల్పులు దేవరసేవకై చనుదెంచుచున్నారు.

( తె ర లో )

ఓలంకాపురీప్రాకార పాలకులారా! వలీముఖసైన్యమువచ్చి మీపురమంతయుఁ బాడుచేయుచున్నది. కాచుకొనుండు. తోరణములు తెంపుచున్నారు. జాగ్రత్త! రాక్షసకబంధములతోఁ బూడ్చిన యగడ్తను మరలఁ ద్రవ్వికొనుఁడు. బంగరు పలక లూడఁ గొట్టిన గుమ్మము లన్నియు బాగుజేసికొనుఁడు. కంటకిద్వారమును మరల నేర్పఱుచుకొనుఁడు. పడిపోయిన ప్రాకారపుందారులు పూడ్చుకొనుఁడు. విఱిచిన యట్టకలును బాడుచేసిన వరాండికలును ముక్కలైనయంత్రంబులును నికుంచితంబు లగు కాంచనికలును మరల నలంకరించుకొనుఁడు,

రావ— (వినినవ్వి) అరరే ఇదియంతయు సత్యమా, అసత్యమా: అసత్యమే. మన దుర్గము మనుష్యులకు సుగమమగునా! అయిననేమి

గీ. అఖిలదేవభయంకరమైన మామ
కీనదోర్మండలం బుండఁగానె లంక
కేల ప్రాకారలోపంబు హీనదశయుఁ
గలుగుఁ? గలిగిన నిదియ ప్రాకారమరయ.

(రాక్షసులనుద్దేశించి సాక్షేపముగా) ఓరీకరంకక. ఓరీకంకాళక. కుంభకర్ణుని లేపుఁడు మేఘనాదుని పిలువుఁడు

(క్రరంకకకంకాళకులెదుటికివత్తురు)

కరం— (జనాంతికముగా) ఓరీ కంకాళక! రాజు కుంభకర్ణునిఁ బ్రబోధింపు మనుచున్నాఁడు కాని యింకను తనయాత్మను బ్రబోధించుకొనలేదు. మనమెంత కష్టపడిలేపినను మరల రామునివలనఁ గుంభకర్ణుఁడు పెద్దనిద్దురపోకమానఁడు.

కంకా— కుంభకర్ణుఁడేకాఁడు; విభీషణుఁడు తక్కఁదక్కినవారందఱికిని నిదియేగతి.

కరం— అవును. (తనలో రావణునుద్దేశించి)

మ. అతిగర్వంబున మించు నీభుజము లేలా, కాల్పనా! పార్వతీ
పతికై కోసి శిరంబు లిచ్చిన భవద్వక్త్రంబులుం గత్తియుం
గతిలేదా! నిదురించువానికయి యాకాంక్షింతు వీవక్కటా?
యతఁడా! సాయమునీకు, విస్మృతశరవ్యాసంగుఁ డోరావణా.

రావ— ఓసుముఖ దుర్ముఖులారా! మీరు మేఘనాదునకును, కనిష్ఠ తాపసక్షత్రియునకుం జరుగుపోరునందలి విశేషంబు లెప్పటివప్పుడు తెలుపుచుండవలయు.

(దేవా చిత్తము అని వారిరువురు రెదుటికి వత్తురు)

సుము— (జనాంతికముగా) ఓయీ! దుర్ముఖా! ఆలక్ష్మణుని పరాక్రమంబును గొప్పదియె. ఏమన నికుంభిలానిర్గతుండగు మేఘనాదునకుఁ గూడ నిట్లు కబురు పంపించినాఁడఁట

ఉ. అమ్ములు తేరు విల్కవచ మబ్బెను నాకు నికుంభిలాప్రియో
గమ్మునఁ గాన జయ్యుఁడను గానని యెంచకు మింద్రజిత్తు! సీ
తమ్మను బాసి వ్యాకులితమైన మదిందగురామచంద్రు కో
పమ్మను బాపి యేన నినుఁ బంతముమీఱఁగ రూపుమాపెదన్.

దుర్ము— అగును, విరాధ ధ్వంసికిఁ గడగొట్టు తమ్ముఁడు గదా. చంద్రునితోడఁ బుట్టిన యమృతమునకుఁ జంద్రునికంటెఁ దక్కువ గుణములుండవు.

సుము— వీరగోష్ఠిప్రసంగములయం దిట్లు చెప్పికొనుచున్నారు.

మ. తలుపు ల్మూసిరి భీతి భోగవతిఁ బాతాళంబునం దేవకాం
తల యోష్ఠంబుల లేఁతనవ్వులకు సన్యాసంబు ప్రాప్తించె నే
యలఘుం డెక్కటిఁ బోరువేళ నతఁడాహా! మేఘనాదుండు శ
త్రులఁ దున్మాడ నికుంభిలాగుహఁ దపోరూఢిం బ్రవర్తించునే.

కరం— (పురోభాగమునకుం జూపునిగుడించి)

గీ. కంకణంబులచప్పుడు గాకయుండఁ దొత్తులై వేల్పుటాండ్రు కాళ్లొత్తుచుండఁ
గుంభకర్ణుఁడు వడి బుసకొట్టుకొనుచు నిదురపోవుచు నున్నాఁడు నిట్టవాడిచి.

కంకా— బాగుగ వర్ణించితివి. కుమార కుంభకర్ణుఁ డిప్పుడు నిద్రానంద మనుభ
వించుచున్నాఁడు.

రావ— నిక్కముగ తమ్ముఁడు భగవంతుండగు పద్మయోనికంటె మిన్నగాఁ దపముఁ
జేయు భంగి నిద్రానందములో నున్నాఁడు.

సుము— (రావణునిచెవిలోఁ జెవియొగ్గి)

క. రణభూమి విడిచి యైరావణమవ్వలికేగ నిందుఁ బంధించి ధను
ర్గుణమును మ్రోయించి భవత్ప్రణయము గన్నట్టి కొడుకు పచ్చెంబోరన్.

గీ. ప్రలయరుద్రుని ఫేట్కారపటిమఁబోలు
మేఘనాదంబు వినుచు సౌమిత్రివచ్చె
నాఁడు మనలంకఁ గాల్చినవీరుఁడ బాహా
బలయుతుండగు హనుమ పార్శ్వంబుగాఁగ.

దుర్మ— ఓహో : దేవ : నీవు మార్తాండపుల స్త్యకులములు రెండును సందేహ డోలపై
నూఁచుచున్నావు.

గీ. కుడి మొగములైదు శ్రీరామ కుంభకర్ణు
లాచరించెడు యుద్ధంబు చూచుఁగాక
మేఘనాదునితోడ సౌమిత్రిసేయు
కలను గనుఁగాక నెడమమొగంబులైదు.

కంకా— అట్లేని మనము కుంభకర్ణుని లేపుదమురా,

కరం— లేపుటకుందగిన యుపాయ మేదియో నాకుం దోఁచదు.

కంకా— పదునెన్మిదికోలముల పాములును రావణుని సేవకై వచ్చి యున్నవికదా :
వానిలోఁ బెద్దపెద్ద పాములకు నియోగింపుము.

కరం— మంచియుపాయము దొరకినది, పాములు తమ మేనుల నతనిమేనితో పెన
వైచుకొని లేపఁగలవు (అని కొంచెము బిగ్గరగా)

గీ. తక్షకుఁడు తొమ్మ్మ సర్పశతంబుతోడఁ
జెవులు కర్కోటకుండు నాసికను వాసు
కియును గాళియసర్పంబు గ్రీవ నిట్లు
చుట్టుకొనుఁడయ్యె కైకసీసూనునొడలు

రావ— ఈపాములు చుట్టికొనిన మాతమ్మునకుఁ దామరతూండ్లు చుట్టిన చందముగా నుండును. ఇంతమాత్రమున లేచునా?

కంకా— సఖా కరంకక ! మన మనోరథములన్నియు వ్యర్థమనోరథములే. మహాఫణీంద్రము లతనిం గించి త్తైనం గదల్పలేకపోయినవి.

(పడమటివైపునఁ దెరలో)

గీ. మయుఁడు తాత వచించిన మాయలెల్ల
మాయమైపోయెనకట యీమర్త్యులయెడ
తండ్రినేర్పినదారుణాస్త్రంబు లింక
లలిఁ బ్రయోగించునట్టి కాలంబువచ్చె.

రావ— వత్సా ! మేఘనాద ! యేల విచారపడెదవు. మాయలన్నియుఁ జేతగాని వానికిఁ గాని నీవంటి నిష్కారుణ వీరునకుఁ గావు.

దుర్ము— కిలకిలమను కోఁతినెక్కి కేల విల్పూని మేఘనాదుని యెదురఁగనిష్ఠతాపసుఁ డేమోమో ప్రల్లదములు పలుకుచున్నాఁడు

కంకా— ఇఁకఁ గేళివిమానమందలి రత్నాట్టాలకమునకుఁ దగ్గఱనుండు పర్వతంబులు మీఁదఁ బడవేయించి లేపుదము.

రావ— (నవ్వి) వీరి యూహ పిచ్చియూహ. ఆపర్వతంబులు కఠోరంబగు తమ్ముని దేహము సోకి బంతులవలె నెగురును గాని యావంతయుఁ బనిచేయలేవు.

కంకా— పర్వతంబులన్నియుఁ త్రాడునకు గుచ్చిన ముత్యములవలె నల్లల్లాడినవి. గాని కార్యకరములు కాకపోయినవి.

(పడమటివైపునఁ దెరలో)

చ. వదలుము మాయ కౌతుకము పాయక పోరుము. నిన్ను వేలుపుఁ
న్మదితలు పెండ్లియాడుదురు; మున్నల మీఖరుఁ డన్న సేనతో
నెదురఁ దదీయరక్తమును నింపుగఁ ద్రావిన నాయలుంగు లీ
యదనున నీదురక్తమును నాగళముం గబలించుఁ గావుతన్.

రావ— ఔరా ! యీలక్ష్మణుఁడు కుమారమేఘనాదునకుం దగనికూఁతలు కూయుచున్నాఁడు. కానిమ్ము వీనిం గుమారుఁడే శిక్షించుఁగాక.

(మరలఁ దెరలో) ఓరీ కనిష్ఠకుక్షత్రియతాపస.

గీ. బుద్ధిమంతుఁడవనుచు నీపొంత దార
నునిచిపోయిన దాని నింకొకఁడు వచ్చి
యెత్తుకొనిపోవఁ జవటవై యొత్తిగిలిన
చెనఁటి పనిచేయుపొంతె లజ్జింపవేల.

సుము— (నేపథ్యమువంకకుం జూచి) ఇంకను నుత్తరముఁ జెప్పుకున్నాఁడేమో.

(తె ర లో)

ఓరీ బ్రహ్మరాక్షసుఁడా! నీకు వీరజనమర్యాదలు తెలియవు. అసాధ్యకార్యముల పట్ల శస్త్రధారణ విడంబనయగును గాని యిట్టిపట్ల నలంకారమేయగును.

రావ— ఏమీ! మనుష్యుల పొగరు. కుమార మేఘనాదునితోఁగూడ వీరవ్రతమందు యుక్తిప్రత్యుక్తులు చెప్పుచున్నారు.

కంకా— (మఱియొకవంకకుంజూచి) మిత్రమా! కరంకక! గురుగళద్దానవారి ప్రక్షాళితగండమండలంబులును గళకుహరకుహరనిరర్గళగులగులారావంబులు నగు దిక్కరులను కుంభకర్ణుని లేపుటకై నియోగింపుము.

కరం— మంచిది. ఓదిక్కరీంద్రములారా.

గీ. కొండచరియలలో వప్రతాండవంబు
నలుపునాఁటి భవద్దంతబలము నేఁడు
ద్విగుణముగఁజేసి లేపుఁడీ దేవవైరిఁ
కుంభకర్ణునిఁ బగరమార్కొనుట కొఱకు.

రావ— ఇది యుక్తమే. దిక్కరులనఁగా జంగమదుర్గములుగదా.

కరం— దేవా! యిది చూడఁదగినది.

గీ. దిగ్గజంబులు నాలుగుదిక్కులందు
బొమ్మపై కెక్కి ద్వంద్వయుద్ధమ్ము సేయుఁ
గుంభకర్ణుండు కటకటా గుఱ్ఱుపెట్టు
కొనుచు నిద్దురలేవఁడు కొంచెమైన.

కంకా— (నవ్వి) దిగ్గజంబులచేష్ట లన్నియు మనవానియెడలఁ జెవిటివానియొద్ద సంకూదినట్లాయెను.

ఇంద్రజిత్తు— (దక్షిణమువై పునఁ దెరలో) ఓరీ! దుర్ముఖ! లక్ష్మణ!

ఉ. రావణితోడఁ బోరుటకు రాముఁడు సుంత సమర్థుఁడంచు నే
నావల వింటి. నీ వతనియట్లుగ శౌర్యము చూపరాకురా

కేవల మన్నదమ్ముల కౌగిటఁ ధనభాగము వచ్చుఁగాని మూ
ర్ఖా! విలువిద్య వచ్చునటరా! యనిలోపల నేపుచూపగన్.

లక్ష్మ— (తెరలో) ఓరీవాచాల! వృథాభిమాన! మేఘనాద.

గీ. తలలు తెగఁగోసికొని పురాంతకునిఁ దృప్తి
పఱచి లంకాధిపత్యంబుఁ బడసెఁ దండ్రి
యనుచు నీకేమి పరువురా? యరుణమణులు
గాక రవికాంతి స్ఫటికము ల్కరఁగు టెట్లు?

ఇంద్రి— (తెరలో) ఓరీ విరోచనకులపాంసనా! కేరళీతనయ! లక్ష్మణ! లంకా యువరాజును రణప్రియుఁడు నగు నింద్రజిత్తు నెఱుఁగకున్నావు. ఇదిగో నెఱుఁగఁ జేసెదను.

లక్ష్మ— (తెరలో) ఓరీ పులస్త్యకులకలంక, ఇద్దఱుతండ్రులకొడుక. రామచంద్ర సేవకుఁడగు సౌమిత్రి నెఱుఁగకున్నా విదిగో నెఱుఁగఁజేసెదను..

సుము— దేవ! లంకాధిపతీ! ఇంద్రజిత్తును సౌమిత్రియు నిట్లొకరినొక రాక్షేపించుకొనుచుండఁగానే——

ఆ. వె. కాఁడలేని నల్లగల్వ లాకాశవా
పికను నెఱుఁగఁ జేయు వేడ్కఁ-కాండ్రు
కేరుచున్న సేన క్రీఁగంటిచూపులు
వేలకొలఁది నిండె విశిఖరాశి.

కంకా— కరంకక! కుంభకర్ణప్రబోధమునకై మమ్ముం గొందఱ నంపుము.

కరం— మీరేమి చేయఁగలరు, ఈశ్వరారాధనంబు దక్క మనకు వేఱుదిక్కు లేదు (అని పరమేశ్వరునుద్దేశించి)

గీ. నంది మద్దెలవాయింప నాగముఖుఁడు
చదువఁ జండిక యట్టహాసంబుచేయ
డమరుకపుమ్రోఁతతో నీవు డాయవచ్చి
రావణానుజులేపుమో దేవదేవ.

కంకా— (తనలో) ఆఁ! కుంభకర్ణుఁడు లేచిన జాళ్ళు నీళ్ళలోఁ దేలి సొరకాయలు మునిఁగిపోవును.

దుర్మ— (కుడిపైపున) దేవా! లంకాపరమేశ్వర? మేఘనాద లక్ష్మణుల ననుసరించి వచ్చు రాక్షసవానరవీరులకుఁ బెద్దయుద్ధము జరుగుచున్నది.

సుము— దేవా! అతిభీషణముగా జరుగుచున్నది చూడుము.

గీ. చాపములు చక్రములును సేజాలువూని
యల్లవీరులు చిత్తంబు లుల్లసిల్లఁ
బోర, మెయిమీఁదఁ బడు కత్తిపోటుతోడఁ
బడు సురస్త్రీల పూదండజడులుగూడ.

కంకా— (ఎడమవైపున దుఃఖముతో) దైవమా ! యీ కుంభకర్ణుఁడెట్లు లేమనోగదా.

కరం— (ఆలోచించి) ఆఁ ! తగిన యుపాయము దొరకినది

చ. బలిసిన గబ్బిగుబ్బ లెదపై బిగియారఁ గదించి వేగమో
వెలఁదుకలార ! యీభువనవీరుని లేపుఁడు కుంభకర్ణు న
గ్గలమగుపైఁడికుండల చొకారముగగ్గిన చంటివింటిపో
టులఁ బురుషాయితంబులఁ బటుత్వము చూపిన లేవకుండునే.

రావ— మాతమ్ముఁడు నిద్రలేచినట్లున్నాఁడే ?

కరం— లేచుటయే కాదు. రాముని సమీపమునకుఁ గూడఁ బోవుచున్నాఁడు.

కంకా— పరిజనమువలన వృత్తాంతమంతయుఁ దెలిసికొని రాముని మీఁదికి యుద్ధము నకుఁ బోవుచుఁ గుంభకర్ణుఁడనుచున్న మాటలు వింటిరా—

గీ. వారిధికిఁ గట్టకట్టినవాఁడు రాముఁ
డంతనేర్పరి నింక నేయమ్మ కనును !
ఉన్నదేదో యనర్థ మిట్టైన్నఁడకట
నన్నకాలమునందు మాయన్నలేపె !

(ఆలోచించి తనలో) స్వభావభీషణుం డగురాక్షసేంద్రుఁ డీమాట విననేలేదు. విభీషణుని వృత్తాంత మీకుంభకర్ణున కేమైనఁ దెలిసియుండునా లేదా ! (అని తెరవం కకుఁజూచి) మరలనేమియో కుంభకర్ణుని మాటలు వినఁబడుచున్నవి. (చెవియొగ్గి విని) దేవా దశాననమహారాజ ! వినుము.

గీ. వలదు చాపంబు తూపులు వలదు వలదు
చక్రమును ముద్గములు పట్టసములు వలదు
ఆఁకలియుఁ దీఱ నశియింతు రరులు గూడఁ
గోఁతిమూఁకను మ్రింగెద గుటుకుమనుచు.

అని యనుచున్నాఁడు.

రావ— సెబాసు వత్స ! నిజముగా నాకుఁ దమ్ముఁడ వగుదువు.

దుర్ము— దేవా ! కుమార మేఘనాదుని రథము వచ్చుచున్నది

సుము— (బాగుగ నిరూపించి)

గీ. అవని నంటనిదౌటc జక్రారవంబు
లేక సిడమున జలదమాలికలఁద్రుచుచు
నగ్నిచూర్ణితకీశసైన్యంబు నగుచు
నీకొడుకుతేరు రాజిల్లు నాకసమున.

దుర్మ— వాయునందనుండగు హనుమంతుఁడును నీకొడుకు రథముతో నాక సంబున కెగసె.

సుము— ఒక్క హనుమంతుఁడే కాఁడు.

గీ. గుబ్బముల నాఁగఁజేసి యర్కుండుచూడఁ
దోవ వైమానికులనెల్లఁ దోసికొనుచు
నంబుదాంతస్స్రితాంబుప్లుతాంగుఁ డగుచు
నెగసె సౌమిత్రి హనుమపై నెక్కిదివికి.

కరం— (ఎడమవైపున)

చ. అవని భరింపలేక కమఠాధిపుఁడుం గిటిరాజు దిగ్గజ
ప్రవరులు శేషుఁడుం దిగులుపాటువహింప ననూరుఁ డబ్జబాం
ధవునిరథంబు భీతిఁ ద్వరితంబుగఁ దోలఁగఁ గుంభకర్ణుఁ డీ
భువియును నాకసంబుఁ దనపూర్వశరీరము నిండవచ్చెడుc.

(తెరలో) ఎవఁడురా యక్కడ। దశాననమహారాజుతో—

గీ. శివునివిలు ముక్కలుగఁ జేసి సీతఁ బెండ్లి
యాడి వాలినిదుంచి రత్నాకరంబు
గట్టి సోఁకులఁ జంపించు ఖలునిఁ జంపి
వందనము లాచరింతు నీపాదములకు.

అని మీతమ్ముఁడు కుంభకర్ణుఁడు శపథము చేసె నని విన్నవింపుమురా.

రావ— సెబాసు తమ్ముఁడా! సెబాసు కుంభకర్ణ! నీవట్టివాఁడవే. లేనియెడల యుద్ధము లలో రావణుఁడు నిన్నెట్లు మెచ్చును.

సుము— (కుడివైపున) దేవా, చూడు మీకనిష్ఠక్షత్రియతాపసుని యుద్యోగము:

గీ. పాకశాసను నిల్లాలి పైఁటకొంగు
ధ్వజపటముచేసికొన్న నీతనయు నగ్ని
కేతనముమీఁదఁగూడ నిశాతబాణ
చయము పడుచుండె వౌర లక్ష్మణుని పొగరు.

(తెరవంకఁ జూచి) సెబాసు మేఘనాద! దశకంఠునియొద్ద ధనుర్వేదము చదివినవాఁడ వౌదువు. దేవా పులస్త్యనందన!

గీ. జలక మాడించె దేని నంజనయు దేని
వాయుదేవుండు మూర్కొనెఁ బ్రిమద మొదవ
వార్ధి దాఁటినయట్టి యావానరేంద్రు
నెత్తిపై నాఁటె నొకయమ్ము నీసుతుండు.

రావ— అట్లేని లంకాద్రోహము చేసినందులకును నక్షకుమారుని జంపినందులకుం దగినశిక్ష కావించెను.

సుము— ఆహాహా! ఈమేఘనాదలక్ష్మణు లిరువురచేత—

గీ. కటికిచీఁకటి దిక్కులఁ గ్రిమ్మఁజేయు
బాణములు నొండొకళ్ళపైఁ బఱపఁబడియు
నమ్ము లగుచుండె సురతోత్సవమునఁ జెవిటి
యాలుమగ లాడుకొను రహస్యములపగిది.

కంకా— (ఎడమవైపున) గణేశ్వరగళగర్జితంబును శంకరడమరుకకోలాహలంబును నాదిసూకరారవంబును నరకేసరినినాదంబును గూడ నతిక్రమించు నీరొద యేమయియుండునో?

కరం— (చెవులు మూసికొని) దేవా! నిజము. కంకాళకుఁ డన్నట్లేయున్నది

గీ. దిక్కరులు భీతిపడ సర్వదిశలు గూడ
శూలి జడ లూడ హరియు సుషుప్తి వీడ
నంది పొరలాడ రోదసులందు నిండి
యాక్రమించెడు నిది ధనురారవంబు,

రావ— వత్స కుంభకర్ణుఁడు సమీపింప జ్యేష్ఠతాపసుఁడు విల్లుమోయించె నని యూహించెద.

సుము— (కుడివైపున) దేవా! గగనాంగణచారులగు మందోదరీసుమిత్రాకుమారుల చరిత్ర మిగులం జిత్రముగా నున్నది. ఇరువుర బాణములు సందులేక యాకసమున నిండియున్నతఱిని—

గీ. డాఁగి చూచిరి సిద్ధులు డంగులేక
సంచరించిరి యమృతభోజనులు సురలు
పతులమెయిపక్క నొదిగిరి పడఁతు లభ్య
సించిరి గణములు శరవిక్షేపవిద్య.

కంకా— (ఎడమవైపున) కుంభకర్ణుఁడు పరిజనము దీసికొనివచ్చిన యుద్ధసాధనము లను గ్రహింపకయే యేల బయలుదేరినాఁడో ?

కరం— అతఁ డనినమాట నీవు వినలేదా యేమి ?

("గీ. వలదు చాపంబు" అను పూర్వోక్తపద్యమునుం జదువుచున్నాఁడు)

రావ— సత్యము. కుంభకర్ణ ! నాకు నీవే తమ్ముఁడవు.

కంకా— ఇది యేమిటి ! కాటుకకొండవంటి పొగతోడను. మేరుశిఖరములవంటి మంటలతోడను సంధ్యాకాలరవిఖండములవంటి స్ఫులింగములతోడను లక్షల కొలఁది బాణములు మండుచు వచ్చుచున్నవి.

రావ— గీ. తొల్లి యొకవానరేంద్రుని తోఁకనుండి
వీఁడు మనవీఁడు గాల్చినవాఁడు గాన
నేఁడు శరణంబుఁ బ్రార్థించి నేరమునకు
నిష్కృతిగావించుకొనవచ్చె నిజము వహ్ని.

సుము— దేవా ! సౌమిత్రిని దహించుటకై కుమార మేఘనాదుఁడు ప్రయోగించిన యాగ్నేయాస్త్రమని యీపాదసేవకుఁ డూహించుచున్నాఁడు (అని వ్రేలితో జూపుచు) ఈపెనుమంటవలన.

గీ. ధాత తనగద్దియను నీటఁ దడుపుచుండెఁ
దారకలతోడ శశి మిన్ను దరలిపోయె
గంగ యమునయు నొకరి నొకళ్ళు కౌఁగి
లించుకొని రేగె వెనకయ్య మంచుకొలకు.

గీ. పేరుకొనె క్షీరములు పాలవెల్లిలోన
రాల్కరిగెె మంచుచెడి శైలరాజమునకు
రవియుఁ దపియించుచుండె గర్భములు పగిలి
కార్మొగుళ్ళును వడి వేఁడికండ్లు గుటిసె.

కంకా— (ఎడమవైపున) ఇట్లు శ్రీరాముఁడు విల్లు మ్రోయించినపిదప వానరు లంద ఱును దమాల తాల హింతాల సాలప్రముఖము లగు చెట్లు యుద్ధ సాధనంబు లుగఁ గైకొని వెడలిరి.

రావ— వీరల లెక్కయేమి? మనవానిముందఱ దోమ లగుదురా, చీమ లగుదురా?

దుర్ము— (కుడివైపున) ఇదియేమిటి ? పది దిక్కులు ముంచు సముద్రమువలె నన్ని వైపులఁ గాలువలుప్రవహించు కొండవలెఁ బెనువెల్లి యొకటివచ్చుచున్నది.

సుము- అగును గీ. త్రిదివసరసులు శాంతాగ్నిదీప్తిఁ జెంద
నగ్ని శౌచాంశుకముకంటె నధికమైన
కాంతితో నున్నచోట మేఘములకింత
తిండియగు వారిపూరము దెసలనిండె.

రావ— ఇది మేఘములు లేనివర్షమా యేమి? (విమర్శించి) ఆఁ! తెలిసినది.

గీ. కేశకుశి యోచు మనయింటికెలన నున్న
వాని నేనేట్లు గుఱిచేతు బాణములకు
జానకీవిరహాగ్నిని శాంతపఱప
వచ్చుచున్నాఁడు వరుణుఁడు వారిరాజు.

సుము— దేవా! కుమారుఁడు ప్రయోగించిన యాగ్నేయాస్త్రము చల్లార్ప లక్ష్మణుఁడు ప్రయోగించిన వారుణాస్త్రమని నేనూహించెదను.

కంకా— (ఎడమపై పున) దేవా! దశాననమహారాజ! తరువాతఁ గొన్ని కోతులు మన కుంభకర్ణుని గోటికొనలు తగిలి రోమములూడి పందులవలెఁ బాదములఁ బడుచు మంత్రింపఁ బడినవోయనఁ బిక్కలయందుఁ దగుల్కొనుచుఁ గట్టు బట్టలవలెఁ దొడలను మూయుచు నశ్వసైనికుల కత్తులవలెఁ బిఱుందులపై దొర్లుచు సుజనులవలె మధ్యస్థములగుచుఁ బేద కుటుంబములవలెఁ బ్రక్కల నిలుచుచుఁ దరుణీస్తనములవలె తొమ్ముల పై విస్తరిల్లుచు జడముడులవలెఁ బృష్ఠములపయి వ్రేలాడుచుఁ జిరకాలమునకు వచ్చిన బందుగులవలె మెడలు గౌఁగిలించుకొనుచుఁ జెక్కలనుండి జాఱు జలబిందువుల వలె గడ్డముల నంటుచుఁ జుంబనరసికులవలె నధరము పీడించుచుఁ బరిమళమువలె ముకు పుటంబులలోఁ దూఱుచు మంచిమాటలవలెఁ జెవిలోఁ బ్రవేశించుచు నిద్రల వలెఁ గన్నులపై మూఁగుచుఁ దిలకములవలె నొసటఁ బ్రవేశించుచు నాదరింపఁ బడిన నీచులవలె నెత్తియెక్కుచు విటులవలెఁ గచగ్రహణ మాచరించుచున్నవి.

రావ— కుంభకర్ణుఁ డీప్లవంగయూథపతుల నేమిచేయుచున్నాఁడు?

కంకా— గొందఱిం జంపెను కొందఱికాళ్ళు విఱిచెను. మోచేతిపోటులచేఁ గొందఱిం గూల్చెను. కొందఱి యెముకలు పిండిచేసె. మఱికొందఱిం గుప్పిళ్ళఁ బిసికియు నఱచేతులం జఱచియు లెంపలు వాయించియు గ్రుద్దియుఁ దన్నియుఁ బొడిచియు నొడిచియు రూపుమాపెను.

కరం— ఇదియంతయు నిజమే.

క. చేతులచేతం గుర్రిద్దుల చేతన్ మోకాళ్ళఁ గాళ్ళచేతను నప్త్ర
వార్రితాయితావయవుఁడగు సీతమ్ముఁడు కోర్రఁతిమూఁక నేలం గూల్చెన్.

సుము— (కుడివైపున నీటిబాధపోయిన ట్లభినయించి) లంకాపతీ! ఒక్కమాఱు శత్రుబలమును దనబలమును గూడ నశించు నేమోయని సౌమిత్రియే యా వారుణాస్త్ర ముపసంహరించినాఁడు.

గీ. బాగుగా మండదగ్ని యిప్పటికి ధూళి
కలుషితుం డగురవి యొడ ల్కడిగికొనియె
నడఁగెఁ జూత్కార మభవుఫాలాగ్నియందు
వారుణాస్త్రపువారి పొంగాఱిపోవ.

కర— (ఎడమవైపున) ఉంకియుండి సీతమ్ముఁ డొక్కతఱి కోపించి——

క. చెవులం గన్నుల నాసావివరముల నోటఁ గల కపిశ్రేష్ఠులఁ ద
ద్వివరములు మూసి హాహారవముల పాల్చేయువాఁ డరాతులుమెచ్చన్.

ఓలంకాపతీ! పౌలస్త్య!

గీ. పులకరించిన పెనులోమములను బట్టు
కొనుచు వ్రేలాడుచుండి మీకుంభకర్ణుఁ
డొడలు విదళించినంతన పుడమి రాలి
యైదుకోట్ల వానరబల మడఁగిపోయె.

దుర్ము— (కుడివైపున భయముతో) ఏమిది! తైలమిశ్రితమగు కాటుకవలెఁ జీఁకటి చెట్టుమాడ్కిఁ గారుకమ్ము మొగిళ్ళపగిది నెమిలి మెడ మాదిరి నారాయణశరీరమురీతి యమమహిషదంష్ట్రిలభంగి గజముఖదానకర్దమము పోలిక నాకసము నల్లనై భయంకరముగా నున్నది!

రావ— ఎవఁడురా యక్కడ? తమోవిరోధియగు సూర్యుఁ డెందున్నాఁడో తీసికొనిరండు. (అనియాలోచించి నవ్వును)

(తెరలో) గీ. జగ మరామంబుఁ జేసి లక్ష్మణునిఁ జంపి
వానరులఁగూడఁ గెడపి యాపైన వారి
గురువయిన నన్నుసైతము కూల్చు నీ కు
మారుఁడని సూర్యుఁడెచటికో పాఱిపోయె.

రావ— (మరల నవ్వి) ఇంక సూర్యుఁడు మేఘనాదుని యెదుటికి రాఁడు.

సుము— దేవ! నీ పదాతిలవమగు సుముఖుని యూహ వినుఁడు. రణాంగణచారులగు

రాక్షసుల నందఱిని గ్రుడ్డివారినిఁగాఁ జేయ సౌమిత్రి తామిసాస్త్రముం బ్రయోగించెను.

గీ. మగనికడ కేగునాండ్రు సంబరము చెంద
జక్కవ ల్విడిపోకకు జడియుచుండఁ
గనుల కవరోధ మగుచుఁ జీఁకటులు పూసె
మంటికిని మింటికిని నీలిమందురంగు

కంకా-(ఎడమవైపున) ఇట్లు ప్లవంగవర్గ మంతయుం గుంభకర్ణతనూకంవముచే మ్రగ్గ సేనానియగునీలుఁడు హతశేషులగు వానరులతోఁగూడఁ బలాయమానుఁడుగాఁగ నొక్కసుగ్రీవుండుమాత్ర ముద్గ్రీవుండై సువేలాచలమునుండి యొక తాటి పెఱికి కుంభకర్ణునిపై విసరెను.

రావ— (నవ్వి) ఇది తామరతూఁటిచే మదగజముం గొట్టుటవంటిది,

కరం— (రావణు నుద్దేశించి) సుగ్రీవుఁ డాతాయి విసరెను. కానిపాపము—

గీ. అవిభీషణుఁడైన నీయనుఁగుదమ్ము
ముష్టితాఁకున నది ముక్కముక్కలయ్యెఁ
జెదరి నల్దెసలకుఁ బర్వు చిన్నిఱాళ్ళ
కపివరుల లక్షలకొలందిఁ గసిమసంగ.

రావ— మనకుంభకర్ణునివలన వీరలందఱికి నీరీతినే చావు మూఁడినది.

దుర్ము— (కుడివైపున) ఆశ్చర్యమాశ్చర్యము. చంద్రకాంతములు ద్రవింపఁ గువలయంబులు వికసింపఁ గమలంబులు ముకుళింపఁ జకోరంబులు ద్రావఁ బొలయలుకలుగల లలనలు పశ్చాత్తపింప మదనోన్మత్తులు భ్రమింప విరహిణీనయనంబులనుండి రెండింతలుగాఁ గన్నీరు స్రవింప మగలతోఁగూడిన మగువలు మూఁడింతలుగా సంతసింపఁ గుపితమానవతులకుఁ జేయు నమస్కారములు నాలుగింతలుగాఁగఁ జీఁకటిగొంగలగుచుఁ జంద్రబింబములు బయలుదేఱినవి.

రావ— ఓహీ సేవాపిదగ్ధ; చంద్ర! రావణసేవానమయము నీవు బాగుగనెఱుఁగుదువురా.

(అని దుర్ముఖువంకఁ జూచి)

గీ. ఎల్లపుడుఁ బండువెన్నెల లెల్లదెసల
నిండియుండిన రాక్షసనేత దయకుఁ
బాత్రుఁడ నటంచు బెక్కురూపములు దాల్చి
నన్ను సేవింపఁగా వచ్చుచున్నవాఁడు,

సుము— దేవా ! యట్లుగాదు. తామిసాస్త్రమును హరించుటకై సౌమిత్రి ప్రయోగించిన చంద్రాస్త్రము.

కంకా— (ఎడమవైపున) దేవా ! తనవిసరినబాయి చూర్ణముచేసెనను కోపముతో మరల సుగ్రీవుఁడు—

గీ. కపిపుంజెట్లరస మేఱుగా స్రవింప
ఫణులు చందననగములపట్టు వీడ
మలయనగమును రెండుచేతులను విసరి
దశముఖానుజునిం జంపఁదలఁచినాఁడు.

రావ— అన్నా ! మర్కటకీటకము పొగరు.

దుర్మ— (కుడివైపున) రాక్షసేశ్వరా ! తమ్ముం బట్టుకొన వచ్చుచున్నవని సూర్యచంద్రులు భయంపడఁ దలపుత్తెలు భువనంబు నిండినవి.

రావ— (ఆలోచించి)

గీ. తరతరమ్ముల సురలకుఁ దనకుఁగల్గు
నట్టి పగదీర్చుకొనఁగ సాహాయ్యకమ్ము
నన్ను వేడఁదలఁచి సబాంధవముగాఁగ
దుర్ముఖా ! వచ్చుచుండె విధుంతుదుండు

(ఆకాశమున) స్వర్భానూ ! భయంపడకుము. రావణుఁడు శరణన్నవానిని రక్షించువాఁడె.

సుము— దేవా ! చంద్రాస్త్రముం బాధించుటకయి యువరాజు రాహుబాణమును వదలినాఁడు.

గీ. పుష్పకము లెక్కి వడివడిఁ బోవుసురలు
దారియిడ నరిష్టంబని దైవవిదులు
తలఁప వేవేలుగ్రహణము ల్వెలయునట్లు
చంద్రులనుమ్రింగె స్వర్భానుసంచయంబు.

కంకా— (కుడివైపున) ఇట్లు సుగ్రీవుండు పర్వతము వైవఁదలఁచి యున్నంతటిలో

గీ. కుంభకర్ణుండు తన చాపకోటివంచి
నారి దగిలించి వాయుబాణంబు విడిచె
మలయగిరితోడ వానరబలముతోడ
వానరేంద్రుండు వారాశిలోనఁ బడఁగ.

రావ— (హర్షక్రోధములతో) అట్టులేని బడబాగ్ని కాహుతి చేయఁబడినవాఁడె.

కరం— లేదు లేదు !

గీ. శరము విడచిన బుజము నీసహజుఁ డొక్క-
మూల ముడువనె లేదొకమూలఁ ద్రిదశు
లేద్వనేలేదు సుగ్రీవుఁ డెట్లువచ్చె
నో! రజోర్వికి వారాశినుండి వచ్చె.

రావ— (తనలో) బలములో నితఁడు వాలికన్నను నెక్కు-వవాఁడె కాఁబోలును. (ప్రకాశముగా) క్రోఁతిజాతికి గంతులు మాత్రమే చేతనైనవి.

దుర్మ— (ఎడమవైపున) లంకాపరమేశ్వరా! చూడుచూడుము; కౌస్తుభమణి లాంఛితంబు లగువక్షంబులయందు వ్రేలాడు వనమాలలయందలి మకరందంబును గ్రోలు తుమ్మెదలవలె నుండు పుట్టుమచ్చలతో నల్లగల్వలకాంతిగల విగ్రహంబులతో గరుత్మంతుల నెక్కి-న నారాయణు లాకసంబున నిండి యున్నారు.

రావ— (సమ్మదముతో)

క. తనయెదపైఁ బొదలు రమావనితను హరియింతు నన్నభయమున నాపే
వనుజేయఁ బెక్కు-మూర్తులు కనిపింపఁగ వచ్చుచుండెఁ గమలాక్షుండున్.

(ఆకసమున) ఓరీనారాయణ! రావణుఁడు శరణన్నవారి పెండ్లముల నపహరింపఁడురా.

సుము— దేవా! నాతలఁపేమనఁగా, రాహుబాణసంహారమునకై సౌమిత్రి నారాయణాస్త్రముం బ్రయోగించినాఁడని.

గీ. పద్మయక్కు-న మీఱఁగఁ బాంచజన్య
రవము మిన్నంట నాల్గుకరంబు లలర
నీలమేఘాకృతులు నింగి నిండియుండె
రాహువులనెల్ల నడఁప గారణములగుచు.

కంకా— (ఎడమవైపున) ఇట్లు సముద్రమునుండి వెలువడి సుగ్రీవుఁడు కుంభకర్ణుం దలపడి విల్లు లాగికొని యది నేలపైఁ బడవైచెను. నీతమ్ముండును గోపముచే గన్నులెఱ్ఱవడఁ జక్రములఁ బ్రయోగించియుఁ బట్టసముల విడిచియుఁ గవచధారుల శరీరములు నయితము భేదింపఁదగిన భుసుండులు వదలియు మేను పులకరింపఁ గత్తులు జడిపించియు సుగ్రీవు నెదుర్కొ-నియె. అతండును నాసాధనము లన్నియు వమ్ముచేసి నియుద్ధమ్మునకు మరలి బాహువు లప్పళించి కిలకిలారావముచే భూనభోంతరములు నిండించెను.

దేవతాసుందరులందఱు సందర్శనకుతూహలంబునం బరుగెత్తి వచ్చుచున్నారు. నిశాచరాంగనలు లంకాపురీప్రాకారశిఖరము లధిష్ఠించుచున్నారు. వానరులు చేతులలోని ఱాళ్ళు నేలపైచియు రక్కసు లాయుధములు ప్రక్కలం దిడుకొనియుఁ జూచుచున్నారు. ఇరువురును బర స్పరగ్రహణోపాయములకై చేతులాడించుచుఁ దలలూచుచు బుజము లప్పళించుచుఁ బరస్పరకఠబంధవిని హతహస్తులై కొంతసేపును నన్యోన్య హస్తాగ్ర ధృతకంధరులై కొంత కాలంబును బరస్పర జంఘాతాడనంబుల గొంతవఱకును డూత్కరించుచు మల్లయుద్ధమారంభించిరి. ఒక జుట్టుపట్టుకొనుటా, యొక గ్రుడ్డు పీకికొనుటా, యొక ముక్కుమీఁద గ్రుద్దుకొనుటా. యొక పండ్లూడగొట్టుకొనుటా యొక గోరులతోఁ జీరుకొనుటా, వారుచేయు పెక్కుపనులు వినోదముగా నున్నవి. పర్వతంబులు సైతము గండశైలములు గ్రక్కుచున్నవి. భూమి చీత్కరించుచు గిఱ్ఱునఁదిరుగుచున్నది. బరు వాఁప లేక కూర్మపతియుఁ దల వంకరగఁ ద్రిప్పుచున్నాఁడు. కావున నీసమయమున దేవర విల్లుధరించిపోవుటయే శ్రేయమని నాకుఁ దోఁచుచున్నది.

రావ— (నవ్వి) వెఱ్ఱివాఁడ! ఇది యొక ద్వంద్వయుద్ధమటరా? దీనికి నేఁ బోవలయునా!

దుర్ము— (కుడిపైపున) దేవా! యిది యేమి వింత! యీఁతకల్లు ద్రావి మత్తిల్లిన నర్తకివలె మత్తిల్లుచు ముదుసలియాండ్రను గూడ యువతులను గాఁజేయు శక్తితోఁ బూవుందూపులు ధరించి విరహిణీకంఠంబులకుఁ బంచమరాగంబు గలుగఁ జేయుచు మృగాంక బాలమిత్రులను దూతీకృత కుమార సమీరులు నగు మన్మథులు వచ్చుచున్నారు,

రావ— (సంతసముతో)

గీ. లోకు లెందఱు గలరొ ముల్లోకములను
వారిమనములఁ బొడమిన పంచబాణు
లెల్లఁ గొలువఁగ మారుఁ డయ్యాశుభీతి
నన్ను శరణొందఁగా వచ్చుచున్నవాఁడు.

(ఆకాశమున) ఓరీ మకరధ్వజా: రావణానుగ్రహంబున నీకు మహాదేవుని వలన నయితము భయము గలుగదురా.

సుము— వైష్ణవాస్త్ర ముపసంహరించుటకై మందోదరీనందనుఁడు మన్మథాస్త్రముం బ్రయోగించెను,

గీ. సిడముల మొసళ్ళు పూవిండ్లు చేతులందు
మధుసహాధ్యాయమగు పంచమస్వరంబు
గలుగు మదనులు తెలిదీవికడకుఁ బంపి
రచ్యుతుల నిందిరాలోచనాంచలముల,

కంకా— (ఎడమవైపున) దేవా! కుంభకర్ణుఁడు సుగ్రీవుని సర్వాంగసంధులు విఱిచి యాకసంబునం గిఱగిఱఁద్రిప్పి నేలంబెట్టి కొట్టెను.

రావ— అట్లయిన మత్తుచేనుఁగు చేతంబడిన యనఁటిచెట్టువంటి యవస్థ వచ్చినది.

కరం— ఇంకొక చిత్రము జరగుచున్నది.

గీ. నేలఁ బడియున్న వానరానీకనాథుఁ
గక్షపంజరదాత్యూహకల్పుఁజేసి
యనుజుఁడదె వచ్చుచుండె జయంబు నీకు
దేవతావైరి! లంకాపతీ! నిజంబు.

గీ. చంకనిఱికించుకొని నాల్గుజలధులందు
నన్నుముంచెఁ గదా వీని యన్న మున్ను
దాని కభిమానియైన నాతమ్ముఁ డిపుడు
కీశనాథునకుం బ్రీతికిర్రియ యొనర్చె.

కంకా— కుంభకర్ణకక్షాంతరగతుం డగు సుగ్రీవునిం జూచి రభసనదన్నూపురరశనాకేయూరులగుచు బృందారకవందిసుందరు లందఱున్నృత్యమ్మారంభించుచున్నారు. దేవా! చూడు చూడుము.

రావ— (సంతోషముతోఁ బరికించి)

ఉ. ఏల పులోమకన్యయు ధనేశుని కాంతలు చంద్రునాండ్రు జే
జేలవెలందులుం బలుగుఁజేఁతలు చేయుట వంపుఁ డొలకుం
జాలు సపత్నులుం గొడుకుచానలు గొల్వఁగ వచ్చి దేవియే
మ్రోల నటించుఁగాతఁ గడుమోదమునం జలపాణిపద్మయై.

దుర్మ—(ఎడమవైపున) దేవా! యిదియేమి యబ్బురము. ఖట్వాంగములు ద్రిప్పుచు నట్టహాసములు చేయుచు డమరుకములు మ్రోగించుచు వేతాళము లెదుట నృత్యముసేయ దేవతాపురంధ్రులుభయమందఁ దలలమీఁది చంద్రఖండంబులఁ గదల్చు నాకాశగంగాతరంగంబులు ఘూర్ణిల్లఁ గోపంబునం బుస్సురని బుసకొట్టు పాపజందెంబులు వ్రేలాడఁ బ్రచండవేషధారు లగుచుఁ జండికాపతు లేతెంచుచున్నారు.

రావ— (సంతోషముతో)

గీ. తలలు తెగఁగోసికొనినయందులకుఁ దగిన
యట్టి వరమును నితని కీనైతి మున్ను
నేఁడొసంగెదనంచు ననేకమూ ర్తి
యగుచు ముక్కంటి నను బ్రోవనరుగుదెంచె.

సుము— దేవా, యట్లుకాదు. మన్మథాస్త్ర ముపసంహరించుటకై తృతీయ దాశరథి యీశ్వరాస్త్రముం బ్రయోగించె నని నాయూహ.

గీ. బాలశశిశేఖరులును గాకోలగళులుఁ
బన్నగాలంకృతులునైన భర్గు లకట
గడియలోపలఁ జిచ్చుఱకంటిలోని
మంటలోపలఁ గలిపిరి మన్మథులను.

కరం— (కుడివైపున)

ఉ. పేర్వులుత్రింపఁగాఁ గదలు వీలుఘటిల్లగఁ జంకదాఁటి వి
ద్రావితుఁడై నఖంబుల నురంబు పగిల్చి రదాళిచేత న
గ్గ్రీవల నాసికంగఱచి లీలఁగ బర్విడె మింటివైపు సు
గ్రీవుఁడు నీసహోదరు నొగిం దన తోఁకనె నెత్తిమొత్తుచున్.

రావ— (దుఃఖముతో) ఔరా ప్రమాదము ! వానరులు కపట ప్రచారు లనుమాట తలంపకయే తమ్ముఁడు పోరుచున్నాఁడు.

కంకా— ఈసుగ్రీవుఁడట్లు కుంభకర్ణుని వంచించి యంతలో గగనమార్గంబునం బ్రథమతాపసుని సన్నిధికేగెను.

కరం— కపిచక్రవర్తి యొనర్చిన చాపల్యమునకుం గోపించి మధ్యమ పౌలస్త్యుండును సమరసమారంభమే శరణముగాఁదలఁచి లంకాపురీ గోపురము వెడలఁగా సర్వసేనాపరివృతుండై స్వయముగా రాముఁడే యతని నెదుర్కొనియె.

కంకా— జాంబవన్మణిమన్మహాముఖ దుస్సహప్రభృతులగు నెలుఁగురాయ లొక్కప్రక్కను గయగవయగవాక్షకటాక్షప్రభృతులగు గోలాంగూలాధిపతు లొకవైపునను దధిముఖదరీముఖదుర్ముఖప్రభృతు లగువానరనాయకు లొకవంకను శరభకేసరకిశోరప్రముఖు లొకదండను నిండియుండ నెదుటికి వచ్చిన రాముంజూచి కుంభకర్ణుఁడు—

రావ— ఇదియే పిపీలికాపన్నగన్యాయము. ఏమిచేసెను?

కంకా— ముద్గరపరిహారములతచే నచ్ఛభల్లకులంబును మూర్ఛనొందించి కొండ్రముచ్చులం బాఱఁదోలి వానరసేనలంబిండిచేసి రామున కభిముఖుండై మూర్ఛదేఱిన వానరులచే నలుదిక్కుల నాక్రమింపఁబడుచుఁ గోపాంధకారమునం గన్నులు గానక ప్రక్కలనున్న పరిజనములతో నిబిడవలీముఖ కబలనకేళి యందుం బ్రవర్తించెను.

(తెరలో) దేవా దాశరథీ! వానరసేనాసంరక్షణమునకై త్వరపడుము.

చ. బలరిపుకుంభికుంభములు వ్రయ్యలుచేసి కృతాంతుపోతుకొ
మ్ములు మొదలంట నూడిచిన ముద్గరముం ధరియించి రక్తముం
గొలుచుచుఁ గుంభకర్ణుఁ డడుగోఁ ద్రిదశాంగన లెల్ల నవ్వ శ
త్రులుఁ దనవారునంచు మది రోయక మ్రింగుచువచ్చె నక్కటా.

రావ— ఔరా! తమ్ముని యత్యర్తియు నధ్యవసాయమును గొనియాడఁ దగినవి!

కరం— (కుడివైపున) దేవా! రాముఁడును దోర్బంధబంధూకృతచాపుఁడై కుంభకర్ణుం దార్కొనె, కుంభకర్ణుండును ముద్గరముందాల్చి వెన్నీక నిలువంబడియె

రావ— ఎప్పుడును మాతమ్ముని సంగర మభంగురమైనదియే.

కంకా— అయ్యో! అయ్యో!

గీ. త్రిదివసతులకుఁ దిలకము ద్దిద్దుచేయి। యరులఁ దునుమాడఁ బైకెత్తినట్టియుండ
రామశరఖండితం బయి భూమిమీఁద। దొరలె మోచేతిదనుక ముద్గరముతోడ.

కర— ఒక్క చేయియేకాదు, భుజదండముగూడ ఖండింపఁ బడినది.

రావ— (కన్నీటితో)

గీ. కంకణీకృత దేవతాకరిరదంబు
మృతకవానరరక్తరంజితతలంబు
తమ్ముకుఱ్ఱనిబాహుదండమ్ము వడియె
నకట నరపశుశరలూనమగుచు నవని. (అనిమూర్ఛవోవును)

కంకా— దేవా! యూరడిల్లుము. ఎడమచేతనే ముద్గరము పట్టుకొని నీ తమ్ముఁడు మరల రాము నెదుర్కొనుచున్నాఁడు.

రావ— (మూర్ఛదేఱి చూచును)

(తెరలో) గీ. దంతఘాతాధరము భయదభ్రుకుటియు
జ్వలితనయనంబు కోపకషాయగండ
మైన నీసోదరునితల యవనిఁ బడియె
నరివిముక్తార్ధచంద్రాకారశరముచేత. (అందఱును క్షోభము నటింతురు)

(మరలఁ దెరలో)

చ. శరమునఁ గంధరంబు తెగి చచ్చియుఁ జావక కోరలన్భయం
కరమగు కుంభకర్ణు తలకాయ పొరింబొరి నిద్రిమత్తుతో
ధరఁబొరలాడుచుంటఁ గని దానిని వాయుకుమారుఁ డింక నె
వ్వరి నిది మ్రింగునో యనుచు వారిధిలోఁ బడవైచె రావణా.

రావ-హా! వత్స. కుంభకర్ణ! నావలన నీకెట్టిపాటువచ్చెనురా తమ్ముఁడా (అనియేడ్చును)

( తెరలో )

గీ. పుష్పకంబులు మరలించిపొండు సురలు । కపులు దైత్యులుపొండు సంగరము విడచి
రవిరథమ దూర మేగుము భువినిఁబడెడుఁ । గుంభకర్ణుని మొండెము కొండవోలె.

రావ— (శోకము నటించుచు)

ఉ. నేఁటికి శేషపన్నగము నీకొనరించిన యెగ్గు మర్వ దిం
తేటికి గౌరి సింగమును నిందుని దంతియుఁ బోలె పోరు నీ
పాటవమున్ సుమేరువునుబట్టి కదల్చిననాఁటి వేలుపుం
బోటుల పాట్లు నే మఱచిపోయెదనన్నను బోవు తమ్ముఁడా.

సుము— (ఎడమవైపున) దేవా! ఊరడిలుము. పెక్కుదుఃఖములు వచ్చినఁబక్కున నవ్వవలయునఁట. పుండుమీఁదఁ గారము రాచినట్లింకొక యాపదమూడినది. అచట లక్ష్మణుండును—

క. వింటం దూపిడి పురముల నంటించినవాని భైరవాకారుని ము
క్కంటిం దలంప నాతని కంటి సెగల్ మేఘనాదుఁ గడతేర్చెఁగటా.

రావ—హా పుత్ర! హాపుత్ర! (అని మూర్ఛపోవును అందఱును యథోచితమాచరింతురు.)

రావ— (కొంతసేపటికి మూర్ఛఁదేఱి)

చ. కెరలుచు వజ్రి తొమ్ముపయిఁ గేలిడి నిద్దుర వోవుఁగాక ని
ర్జరులును గాలిసంకెలలు జాఱి సుఖింతురుగాక దేవతా
తరువుల పూలు దేవతలె తాల్తురుగాక దశాస్యుచేత నె
వ్వరికిని దెల్పరాని దురవస్థకుఁ బాలయితయ్య పుత్రికా!

(అని యెల్గెత్తి యేడ్చి) ఓకింకరులారా! నన్ను మందోదరీభవనంబునకుం గొంపొండు

(అని అందఱును నిష్క్రమింతురు)

ఇది .... శ్రీతిరుపతివేంకటేశ్వర విరచితంబగు నాంధ్రి
బాలరామాయణ నాటకమునం దష్టమాంకము.



శ్రీమత్పరదేవతాయైనమః

# బాలరామాయణము



## నవమాంకము



(పిదప యమకింకరుఁడు ప్రవేశించును)

యమ— ఆహా! పూజ్యుండును ఖలాయవాహనుండును సకలప్రాణి భయంకరుండును నగు శార్ఙ్గదేవుని విశ్వాతిశాయి యగు ప్రభావము!

గీ. సతతవికసితనీరజాసననివిష్టుఁ
డగుచుఁ దనయిచ్చ నీరేడుజగములను సృ
జించి మించినవాఁడు విరించి వేద
కర్త నిట్టూర్చెఁ బితృపతికతనఁ గాదె.

(పరిక్రమించి ప్రక్కకుంజూచి) ఔరా! వీరచూడామణియగు నక్తంచరేంద్రుని ప్రతాపము! గరుత్మంతుని రథముగాఁజేసి మాతలిసుతుండగు సునీతుఁడు సారథిగా యుద్ధరంగమునకుఁ దేర రామునికొఱకుఁ బంపించితిననియు, నేఁడు రామరావణులకు ద్వంద్వయుద్ధము జరుగుననియుఁ. బుత్రదర్శనలాలసుండును మాకుఁ బరమమిత్రుండును నగు దశరథమహారాజుతోడను యుద్ధప్రచారము వినిపించు చారణమిథునముతోడను నేనాయుద్ధరంగమునకుఁ బోవుచుంటి ననియుఁ, జిత్రగుప్తుల పుస్తకములో లంకానివాసుల లెక్కఁదీయించి మాకుంబంపుము—

గీ. లంకలోనున్న రావణు లెంక లెంద
ఱెప్పు డెవ్వరిచే వధియింపఁ బడుదు,
రదియు, రామునిచేత లంకాధిపతికి
నెట్లు మృతియగునో దాని నెఱుఁగవలయు.

అనియుఁ బురుహూతుఁడు దనకుం బంపించినవార్త త్రిలోకనియామకుండగు యముండుకూడ నాతో నేకాంతముగాఁజెప్పి యాపని నెఱవేర్పు మనియె. నేనును జిత్రగుప్తుని కడకుంబోయి యాలెక్కలు దీయించి యవి పురుహూతున

కందఁజేయవలయు. (అని యాలోచించి) ఔరా! దశాననుండు పరాక్రమములో నందఱికిని మీఁదివాఁడే కదా; కాఁదేని—

గీ. దేని గనుఁగొన్న నిర్జరాధిపతియైన
వేయి కన్నులు ముకుళింపఁజేయు భీతి
నట్టియము కాలదండ మీయసురనాథు
కంఠములయందుమాత్రము కుంఠమగునె.

మఱియును- గీ. సకలజంతువులకు వినాశంబుఁ జేయు
దుండగుండగు యముఁడును దండమూని
వీని నెదిరించుటంగాదె విఱిగిపోయెఁ
బురుషభావంబుతోఁగూడఁ బోతుకొమ్ము.

(అని నలుదెసలు పరికించి) ఇడుగో! చిత్రగుప్తుఁడు (అని సమీపించును)

చిత్ర— (ప్రవేశించి)

గీ. వానరులచేత రాత్రిందివంబులందుఁ
జంపఁబడినట్టి దైత్యుల చావులెక్క-
లట్టివ్రాయఁగ ఖేదజడాంగుళీ క
ఠోరమయి చేతి తిమ్మెర తీఱదాయె.

యమ— (డాయంజని చెవిలో నేమోమో చెప్పును)

చిత్ర— స్వామియానతిప్రకారము చేయుదును (అని నలుదిక్కు-లుఁగలయంజూచి) ఈపార్శ్వముల బ్రిచ్ఛన్నుఁడుగాని మత్తుఁడుగాని యెవ్వఁడును లేఁడుగదా! మంత్రము వెలియగును. (అని లెక్క-లపుస్తకము వానిచేతికిచ్చి) సరిచూచుకొనవలయును. నీవు చదువుము.

యమ— (చదువును)

గీ. కృతయుగము చన్నపిదపను త్రేతనాదిఁ
గార్తికంబునఁ గృష్ణపక్షప్రథమది
నమున గట్టిరి వార్ధి గ్రావములచేత
రామభక్తులు కపులు దోర్బలముమీఱ.

గీ. కోప ధూమ్రాక్షుఁ గాటుకకొండఁబోలు
వాని ధూమ్రాక్షు విగతకంపను నకంప
నుని వధించెను మారుతతనయుఁ డధిక
రోషవివశుండు చెఱియొక గ్రుద్దుగ్రుద్ది

గీ. దీర్ఘభుజుఁడగు నీలుండు దీర్ఘ నిద్ర
నొందఁజేసెఁ బ్రహస్తు రఘూద్వహుండు
కుంభకర్ణుని గాటుకకొండవంటి
వాని ఖండించె రెండవవారమందు.

గీ. అంతకుండయ్యెఁబోర నరాంతకునకు
నంగదుండు భుజాలంకృతాంగదుండు
అంతకునిఁ జేర్చె హనుమ దేవాంతకత్రిశి
రసులఁ బిడికిలిచే గలదసులఁ జేసి.

గీ, ఋషభుఁడను వానరుఁడు వధియించెఁ బిదప
బార్శ్వములు చించి యలమహాపార్శ్వునాముఁ
జేసె నతికాయు నిష్కాయుఁ జితర్రియుద్ధ
ఘనుఁడు సౌమిత్రి మూఁడవ దినమునందు.

గీ. కడఁగి కుంభనికుంభులఁ గౌంభకర్ణు
లను వధించిరి రవిమరుత్తనయు లవల
దామరసలోచనుఁడు ఖరాంతకబలుండు
రామభద్రుఁడు మకరాక్షుప్రాణముడిపె.

గీ. మేఘనాదునిఁ జంపె సౌమిత్రి నిహత
నాయకములైన నిశితాగ్రసాయకముల
నాలుగవనాఁడు వానరనాథుఁ డలుకఁ
గొని విరూపాక్షుని మహోదరుని వధించె.

గీ, రాఘవేంద్రుఁడు నిశితాస్త్రలాఘవమునఁ
గడఁగి చంపఁగలఁడు దశకంఠు విహిత
సంగరోత్కంఠు నేఁడు నిజంబు నిజము
పరసతీహర్తలకు నిట్టి పాటులనఁగ.

చిత్ర— సరిగానే యున్నది. నీవుచని వేగముగా నివి దేవేంద్రునకిచ్చి మరల మన స్వామితో నివేదింపుము. నేను గార్యశేషంబునకై పోయెద. (అనియిరువురును నిష్క్రమింతురు.)

(ఇది విష్కంభము.)

(పిదపఁ బురందర దశరథులును చారణమిథునంబును బ్రవేశింతురు.)

చార— ఆర్యా ! మాతలీ. సకలదానవేశ్వరపరాక్రమణంబును కౌతూహలోత్తానిత సకలలోక లోచనపక్ష్మంబును నైరావణలక్ష్మంబును గగనాంగణసంచరణ వేగతరళితమాణిక్యకింకిణీనినాదనిష్యందనంబునగు స్యందనంబు వేగ నడపుము. సురాసుర సంగరప్రదేశంబు నతిక్రమించియున్న రామరావణసమరాంగణము లోచన గోచరం బగుచున్నది. (అందఱును రథవేగము నటింతురు)

దశ— భగవంతుఁడా ! గీర్వాణనాథ ! అనుగ్రహించి దృష్టులివై పునకుం బఱపుము.

క. లతతోడ న్వికసించిన యతసీగుచ్ఛమన రాముఁడదె చొచ్చె రణ
క్షితి ధన్వియగుచు లంకాపతియును విలు పూనివచ్చె వారిద మనఁగన్.

(ఆకసంబునఁ జెవియొగ్గి) రభసోల్లసితహృదయామోద ముద్రిం డగు రామభద్రిం డేమనియో యనుచున్నాఁడు.

మ. "అసురాధీశ్వర! సీతనిమ్ము నిను నే యాచించితి న్మానుమీ
యసదాచారము. మించలే దిపుడు కార్యంబైన, లేదేని రా
ర! సమాకృత్తఖరాదికంఠవిగళద్రక్తావిలంబైన నా
రసముం బూని దశాననంబులు ధరారంగంబునం గూల్చెదన్."

పురం— భూదేవేంద్ర ! మీరామభద్రిన కెన్ని యేండ్లున్నవి ? ఇంతటి ప్రాయము లోనే యేండ్లు గడచిన పెద్దలనవలసినమాట లభ్యస్తములయినవి.

దశ— (వినయముతో) దేవా ! ఇది దేవర యనుగ్రహమే. ఇనుము ద్రవించుటకు సూదంటుఱాతి బలిమిగాక వేఱున్నదా. (మరల మింట చెవియొగ్గి) ఇవి రాక్షస రాజుమాటలు. "ఓరీ రాముఁడా ! దోర్దండచండిమా హృతపరశు రాముఁడ ! నా పరాక్రమమును నీ పూర్వపురుషుఁడే సహింప లేకపోయెను. నీవన నెంత !

గీ. తావికై వచ్చుతుమ్మెద దంతిచెవుల
చేత దెబ్బలు దినులీలఁ జేతఁగాక
చెంపకాయలు దినియె నాచేత మును వ
రేణ్యగుణుఁడగు మీయనరణ్యనృపతి.

ఇంతియే కాదురా, ఓయనరణ్యకులకుమార !

మ. నను దాఁకె న్మారిచక్రముం గుపితకాంతాకుండలాఘాతమో
యన, నామూఁపునఁ గాలదండము మృణాలాకారమై యుండె, తొ

మ్మనఁ గాంతాకుచహారమట్లు దొరలెంబో వజ్రముం; దూపు లీ
వును నాపై నిగిడించెదేని నవి పూవుందూపు లౌ రాఘవా."

పురం— (ఆలోచించి) రామరావణుల వచనరచనయం దెంత హెచ్చు లొచ్చుగలదో చూడుము. గౌరవము బుద్ధిమత్తచే వచ్చునుగాని వయస్సుచేతరాదు.

చార— (చెవియొగ్గి) అమాటకు రాముఁ డిట్లనుచున్నాఁడు. (తెరలో) అట్లయిన ననంగబాణోపమానంబు లగు నాబాణంబులు సహింపు మివిగో విడుచుచున్నాను.

చారణి— (సంభ్రమముతో నమస్కరించి) దేవా! విశదకమల మనోహరంబు లగు నయనాంచలంబు లీవంకకుం బఱపుము. ప్రళయకేతుదండాకారం బగు బాణంబు కోదండదండంబునుండి మొదట విడిచినపిదపనే రామభద్రుని మొగంబునుండి మాటలు బైలుదేఱినవి. భగవానుఁడా! ఇంద్రాణీవల్లభ! ఈరాముని చరితవంటి చరిత వినియుఁ గనియుఁ గూడ నెఱుంగము. మందోదరీచుంబనవిలుప్తతిలకం బగు దశాననుఫాలఫలకంబున జయధ్వజదంబుగా నొక్కబాణమును నాటెను.

చార— సుగేహినీ! నీవు బాగుగ గుర్తింపఁ గలవు సుమీ.

చ. ఎచటఁ దృతీయలోచనము నీశ్వరుఁ డర్థి వహించి యుండెనో
యెచట విశేషకంబుఁ బృథివీశ్వరు లందఱు తాల్చుచుందురో
యెచటఁ ద్రిభంగికాకృతివహింపఁగ జేయునొ క్రోధ మేరికే
నచటనె రాఘవేంద్రుఁ డొకయమ్మనఁ గొట్టెను రాక్షసేశ్వరుణ్.

చారణి— అయ్యో! అయ్యో! దశాననహతకుఁడు దళదింద్రనీలదళాభిరామంబగు రాముని పెన్నురంబునం గృతాంతదంష్ట్రికరాళంబగుశరంబు గ్రుచ్చెను,

దశ— ఎవఁడురా అక్కడ! పురందరమిత్రంబగు దశరథుఁ డెదుట నుండఁగానే రావణుఁడు రామునిం బ్రహరించుచున్నాఁడఁట.

పురం— సఖా! దశరథ! ఇది ద్వంద్వయుద్ధము కదా! ఇరువురు పోరాడుచుండ మూఁడవవాఁడు చనుట క్షత్రియధర్మము కాదు.

దశ— పూజ్యుల మాట కడుగు దాఁటను గాని యిప్పుడు కర్తవ్యమేమి?

పురం— చేయఁదగిన పని రాఘవధురంధరుండగు మన రామచంద్రుఁడే చేయఁ గలండు.

చారణి— ఔరా! యీమొక్కలి రక్కసుని పొగరు.

గీ. జానకీదేవి నిదురించు శయ్యపైడి
లేటితోల్దాల్పు గ్రీవకవాటసమము
చిరపరిత్యక్తమౌక్తికసరమునైన
రామునురమందు గుచ్చె నారాచ మకట.

దశ— దశకంఠా! మంచినేర్పరివిరా! ఒక్క యమ్ముచేతనే దశరథరాము లిరువుర హృదయములను వ్రచ్చితివి.

చార— (సంతోషముతో చంకలు దాటించుకొనుచు) దశరథమహారాజ.

క. మందోదరి వలిగుబ్బలయందలి కుంకుమముచేత నందంబయి చె
న్నొందు రిపు నెడఁదవయిఁ జొన్పెం దారుణమైనశరము నీకొడుకు బలా!

చారణి— (చమత్కారముతో) చెవి దాఁకఁ దాఁకు వింటి నడుమునుండి వెడలు తూపులు ముజ్జగంబులనిండ" రామరావణులొనరించు నిర్భరంబగు సమరంబుఁ జూడఁజూడ మన ముప్పొంగుచున్నది.

పురం— మిత్రమా! మహీమహారాజ! మనరాముని ధనుర్విద్యాపాటవంబుం గనుం గొనినఁ ద్రిపురాంతకుండు నాతలఁపునకుం దగులుచున్నాఁడు చుమీ.

దశ— (ఆకసమునఁ జెవియొగ్గి) మిత్రమా! పురందర! రామభద్రుని చరిత్రకు సంత సించితివని యీదశకంఠుఁడు నిన్నుఁగూడ నేమేమో మాటలుమిగులుచున్నాఁడు.

(తెరలో)

మ. పతికిం బంధముఁబాపి బ్రోవు మనుచుం బౌలోమి కోశం దయా
మతి నే నిన్విడనాఁడునాఁటిగతి సంస్మర్తవ్యమోరీ! దివ
స్పతి! యేమీ! యిటుతప్పఁ బల్కితివి రక్షస్వామికిం బాణిసం
శ్రితధారాశితచంద్రహాసునకు నిస్సీ యిట్లనం బోలునే.

ఓకపిలలోమశబాహూ! అహల్యాజార!

ఉ. రాముని పేరుచెక్కిన శరంబులు నాలుగు మింటి నంటఁగా
నేమని వేయి కందొవలు నింతలు చేసెదవోరి మూఢ! సు
త్రాముఁడ! నేఁడె రావణుఁడు రాము ననిం దెగటార్చు రేపు నీ
బాములు చూడు మడ్డపడువాఁ డెవఁడో నిను బందివెట్టెదన్.

దశ— (మరల నాకసమునఁ జెవియొగ్గి) ఆమాటలు విని రామచంద్రుఁ డుత్తరము చెప్పుచున్నాఁడు. దేవా! వీరిరువుర సల్లాపములను వినుము.

(తెరలో) ఓరీ! వాలిబాలమిత్రమా! పౌలస్త్య! వీరధర్మ పరిభాషలు మీ వంటివారా ప్రవర్తింపఁ జేయువారు. ఇదియేమి, ఒకఁడు ప్రతిపక్షుఁడై యుం

డఁగా నింకొకనిపైఁ గోపగించెదేల? పోరఁగల వేని నాతోనేపోరుము, ఇట్టి యసంబద్ధ ప్రలాపములాడు నిన్ను క్షత్రియుండగు రాముఁడే శిక్షించువాఁడు.

రావ— (తెరలో) ఓరీ మానుషీపుత్ర ! రాముఁడే క్షత్రియుఁడా. రావణుఁడు కాడు గదా! కానిమ్ము శిక్షించువాఁడెవ్వఁడో శిక్షింపఁబడువాఁడెవ్వడో చూతము.

రాము— (తెరలో) ఓరీ! అమానుషీపుత్ర! రాముఁడేక్షత్రియుఁడు, రావణుఁడుకాఁడు

చార— ఇట్లు వాక్యోపవాక్యములచేఁ దామసములు హెచ్చి రామరావణు లిరువురును శరవర్షములు గుఱిపించుకొనుచున్నారు,

చారణి— ఓ దేవతాపరమేశ్వరా ! యుద్ధ మతిభీభత్సముగానున్నది. జెండాగుడ్డలు కూలుచున్నవి. ధురాబంధంబులు విఱిగిపోయియుఁ దాళ్ళుతెగియు నరరంబులు డుస్సియుఁ గూబరంబులు భగ్నంబులయ్యు తేర్లుదొర్లుచున్నవి. ఇంద్రియంబులు చెడియుఁ జరణంబులు వికలంబులై పదాతులుమడియుచున్నారు విద్యాధరదంపతుల నడుచు దేవతామిధునంబుల గాయపఱుచుచుఁ బన్నగ వివరంబులందూరుచు గంధర్వ వర్గంబుల గంధంబులడంచుచుఁ సిద్ధులందఱుముచు శకుంతసంతానంబులకు బెదరుపుట్టించుచు వీరప్రతివీరప్రయుక్తంబులగు శరంబులు లెక్కలేక యెక్కడఁ జూచినను నిండియున్నవి.

చార— (లెస్సగనాలోచించి) విరించి విలోచనకులతిలకులకు ధనుర్విద్యాపాటవంబునం జాల హెచ్చుతగ్గు గలదు.

గీ. పదికరంబుల నొకసారి పంక్తిముఖుఁడు
పదిశరంబులు రాఘవుపైకిఁ బఱుప
శరము లీరేను రాఘవస్వామి యొక్క
చేత సంధించి వాని భంజించుచుండె.

మఱియు నో దేవతాచక్రవర్తీ ! కామ్యమానకాంతాపరిగ్రహంబులగు వస్తువు లేవియైనను గాముకుల కానందజనకంబులే.

చ. ఉరమునఁ గౌఁగిలించుకొనుచుండె ధరాసుతచేతిగంధపుం
గురుతులుగల్గు రామనృపకుంజరు తూపులు పంక్తికంఠుఁ డ
ద్దిర ! మరుశక్తి యక్కతన దేహము చెమ్మటపట్టి పుల్కరిం
చె రసవశత్వము న్మిగతచేష్టలుఁ జెప్పఁగనేల వానికిన్.

చార— అయ్యలారా ! వినుఁడు విచికిత్సాక్రోధములతో రాముఁ డేమేమో యనుచున్నాఁడు.

రాము— (తెరలో) ఓరీ మూఢ రావణ ! యీసమబాణవర్షముచేతనే రామునిబడాయి

తెలిసిన దనుకొనకుము. నిన్నుజంపుటకు మావిశ్వామిత్రభగవాను లుపదేశించిన దివ్యాస్త్రములు పెక్కులుగలవు.

చారణి— (సంభ్రమముతో) ఇదియేమి. ఆమూలఫలితస్ఫులింగజటిలజ్వాలావళీవిలీన తుహినసరణీసారణీపూర్యమాణమందాకినీచంద్రభాగాదినదీసార్ధమంధరిత విస్తారంబును నుత్తరదిగంతరస్థంబును సకలకులశైలరాజంబుననగు హిమవంతమా! లేక సంతతతనోత్తపనతరళశిలాజతునిష్యందనిర్భరదహ్యమానచరణచంక్రమ ణాక్రందితకరీంద్ర ఘీంకారంబును స్రోతస్సలిలప్లావితతటాంత పతత్ప్రస్తర ప్రివృత్తశబ్దసందోహభరితగంభీరగురుగుహాకుహరమధ్యంబగు వింధ్యమా? లేక సీమసీమాయమాన శ్రీఖండమండలీభ్రష్టభుజగభోగభ్రియమాణ తామ్రపర్ణోపవనవిచ్ఛిన్న నితంబడంబరాలంకృతదక్షిణమహీవలయంబగు మలయమా? లేక దాహకుపితకుంభసంభవమహాముని గేహినీదత్త వివర్ణదృష్టిచ్ఛటాకలాపసంకుచిత చటులజాలుకోత్పీడపరిహ్రియమాణ మాణిక్యచక్రవాళవేల్లిత శిలాతల లతాభవనరభససంభావిత హూతవహోచ్ఛేద ముహూర్తసుఖసుప్తవిద్యాధర మిధునజనితమనోమోహనంబగు రోహణమా?

పురం— అవియేవియునుగావు. పౌలస్త్యునిం జంపుటకై యస్త్రతంద్రుండగు రామచంద్రుఁడు ప్రయోగించిన యాగ్నేయాస్త్రము.

చ. బిరబిర విల్లుద్రిప్పుచును బీరము పొంపిరి వోవ రాక్షసే
శ్వరుపయి రాముఁ డేయు శరజాలము లాతనిఁ దాఁకి మీఁదుగా
నఱిముఱి నెచ్చటంబడెనొ యచ్చట నొక్కొకబాడబంబు సా
గరమునఁ బుట్టజేయుగతిఁ గ్రాఁచుచునుండెఁ దదీయనీరమున్.

మఱియును,

గీ. పైడిమల పైడి ద్రవమయి పాఱఁదొడఁగె
మాడెఁ గల్పాగముల కుసుమవ్రజంబు
నిప్పుకలు గుఱిపించెను నీరదములు
రామనిర్ముక్తవహ్నిశరంబుచేత.

చార— (ఆకాశమునఁ జెవియొగ్గి) ఆర్యులారా! యీ రావణుని పల్కులు వినుండు (తెరలో) నీవు దివ్యాస్త్రములు ప్రయోగించిన నేను ప్రయోగింపలేనా!

గీ. హృదయతాపంబు బాష్పవాహినులు శ్వాస
ములను నాగ్నేయవారుణానిలశరముల

సీతకయి యోర్చుచుండిన జెట్టి నేమి
సేయునుర రామ ! నీదివ్యసాయకములు.

చారణి— పారిజాతవృక్షముల మొదలంటఁ బెఱికివైచుచుఁ గల్పవృక్షములనున్మూలించుచు సంతానసంతానంబులం జెల్లగించుచు మందారద్రుమంబులఁ గందంబులూడ్చుచు హరిచందనంబులం బాడొనర్చుచు నీరేడు లోకంబులు కంపిల్ల ఝంఝూమారుతంబులు విసరుచున్నవి. దేవా ! విలోకింపుము.

పురం— రామనిర్ముక్తమగు నాగ్నేయాస్త్రము తనకుం దగినది కాదని దానిం బ్రజ్వలింపఁ జేయుటకై పౌలస్త్యుండు వాయవ్యాస్త్రముం బ్రయోగించెనని నే దలంచెద.

మ. అమరాగంబులఁ గూల్చుచుం ద్రిదివసద్యానంబులం ద్రోలుచున్
బ్రమదోద్యానములందు వర్తిలెడు జెండాకంబము వ్రాల్చుచుఁ
గమనీయాగ్నిజబర్హిపింఛమును దూఁగం జేయుచున్ వచ్చె సం
ద్రమునం గల్గిన విద్రుమవ్రతతి నీరఁ ముంచుచుం బయ్యెరల్.

చారణి— దేవా ! పురందర ! ఇది యేమి ! మసృణరాజపట్టస్నిగ్ధముగ్ధంబగు నల్లని కాంతి గగనంబున కుల్లాభంబు గట్టుచున్నది. కలకలరవోత్కంఠ కంఠంబులగు శితికంఠంబులు నృత్యంబుసేయుచున్నవి. నిబిడోల్లాసితవంశకరీరంబులను దులితకరీంద్రంబులు నగు జలధరంబులు గర్జిల్లుచున్నవి.

పురం— పవనోద్దీపితమగు నాగ్నేయాస్త్రముం జల్లార్చుటకై రామభద్రుండు జలధరాస్త్రముం బ్రయోగించె నని తలంచెద,

సీ. పలువితంబులగు రంగులు గల్గు శక్రచాపం బొకవంక శోభనువహింప
నీటిబ్రబ్బలు మొల్వ నీరధారలు నేలఁ బడకుండఁ జాతకపక్షి గ్రోల
శక్రచాపమువంటి చాయలు కల్గు పింఛమ్ములు విప్పుచు నెమ్మి లాడ
రవనూని మెఱుఁగిడి సవరఁగాదువ్విన యాంధ్రకాంత శిరోరుహములపగిది

గీ. మొగలితీవల కెల్లెడ మొగ్గలొదవఁ
గడిమిపూవుల తావి లోకములు గప్ప
కమలములు రూపు మాయఁగఁ గదుపుగట్టి
గగనమున నిండెఁ బెనుకాఱు మొగులదండు.

గీ. పుడమికిని నింగికిని గల నిడివి కొల్చు
దండముల భాతిగా నీరధారలలర

ముజ్జగంబులు గూడ సముద్రి మధ్య
మందు నొకసారి మున్గుచున్నట్లు దోఁచె.

చారణి— దేవా! యిటు చూడుము. నీటియేన్గులు పరస్పరముం బోరాఁడఁ దరగలపై నాఁడుకొనుటకై జలాంతరమగ్న పర్వతంబుల యందలి పక్షులెగురుచుండ లక్ష్య మాణైరావతబాంధవంబును సముల్లసత్ప్రియూషశేషంబును దృశ్యమాన దేవద్రుమాలవాలంబును నవలోక్యమాననారాయణసూకరసముద్ధృత ధరణీ పృష్ఠనిలయస్థానంబును విస్తార్యమాణ కౌస్తుభసగోత్రమణికరంబిత పాతాళ జంబాలంబును నుచ్చలల్లక్ష్మీబాలవిలాసోద్దేశంబును ససంభ్రమభ్రమత్కచ్ఛ పాది డింభకవర్గంబును బ్రకటాయమానదామోదర నిద్రావిమర్దశయనీయశేష రమణీయంబును దిమి తిమింగిళతిమింగిళీలాది జలచరజంతుభీకరంబును నగు సముద్రసమూహంబు జగంబులు ముంచుచున్నది.

పురం— నిజముగా వారిదాస్త్రము తనకుం దగనిదని యెంచి తదుద్దీపనార్థంబుగాఁ బౌలస్త్యుం డుదన్వదస్త్రముం బ్రయోగించె నని తలంచెద.

ఉ. రక్కసులేడ్పు నేడ్పులకు వ్రిస్సినశుక్తులు లోని ముత్తెము
ల్గ్రక్కఁగ నౌర్వముం జలచరంబుల యాహుతి బిట్టు మండఁగా
తెక్కలు గల్గుకొండలు చరింపఁగఁ బొంగెడు నెల్లలోకముల్
గ్రక్కున ముంచివేయఁగల కాలమునంబలె వార్ధులక్కటా.

చారణి— దేవా! దశశతాక్ష! చూడుము చూడుము: కలికాలనిర్వాపణక్షములును వార్ధిసప్తకపానప్రవీణులును నిర్వాణనగరరాజమార్గాయుతులును ధర్మ ద్రుమా రామభూతులును గ్రోధపాదప పరశుప్రాయులును నిబిడితజటాజూటబంధు లును గమండలుమండితహస్తులును బ్రకటితయోగపట్టాభిరాములును బ్రహ్మ సూత్రపవిత్రితభుజస్కంధులును భగవంతులు నగు నగస్త్యమహర్షులు లక్షల కొలంది వచ్చుచున్నారు.

పురం— ముజ్జగంబులు ముంచు కడలిపేరిఁటి పెనువెల్లి నుపశమింపఁ జేయుటకై రఘుకులధురంధరుం డగస్త్యోపదిష్టంబగు నగస్త్యాస్త్రముం బ్రయోగించెఁ గాఁబోలు.

మ. పతిభక్తిం బరిచర్యలం జలుపు లోపాముద్రలం గూడి ధా
తతరంబైతగు చీరతో ద్రుహిణసూత్రభ్రాజితాంసంబుతో
రతనంపుంగనికొండ నుండెడు తపోరాసు ల్మునుల్ కర్ణసూ
త్రితరుద్రాక్షమయాక్షమాలికులు వీరే వచ్చుచున్నారొగిన్.

